# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమలద్వారా మానవజాతి సామాజిక నైతిక ఆధ్యాత్మిక అభివృద్ధికి అర్పితము.


సంపుటము 34 | మార్చి 1991 | సంచిక 3


....విషయసూచిక....






సంవత్సర చందా : తెలుగు లేక ఇంగ్లీష్ :

ఇండియా : రూ. 20/-, ఓవర్సీస్ : ఎయిర్ మెయిల్ రూ. 140/-

సీ మెయిల్ రూ. 70/- U. S. $ 4.5, £ 2.5 U. S. $ 9, £ 5.00

ఆంధ్రప్రదేశ్, అనంతపురం జిల్లా, ప్రశాంతినిలయంలోని శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ప్రెస్సులో ప్రమోద్ కుమార్ సూరిచే " శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్ ట్రస్టు " తరపున ముద్రింపబడి, ప్రచురింపబడినది. సంపాదకుడు : వి. కె. నరసింహన్.

శివరాత్రి సందేశం:

# మంచితనమే దైవతత్త్వం

"ఈ ప్రకృతి యందు దివ్యత్వమైన దైవము- నువ్వుల మధ్య నూనె ఉన్నట్లుగా, పాల మధ్య నెయ్యి ఉన్నట్లుగా, పూలయందు పరిమళము ఉండినట్లుగా, ఫలము నందు మధుర రసము ఉండినట్లుగా, కట్టెల మధ్య నిప్పు చేరినట్లుగా—ఉన్నాడనే సత్యాన్ని గుర్తించాలి". "కనిపించే జగత్తులోన కనబడనటువంటి చైతన్యమే ఆత్మ యగును. అదే రీతిగనే, మణులలోపల చేరిన సూత్రమువలె— విశ్వమంతయు విష్ణువు వ్యాపించి ఉన్నాడు."

ప్రేమస్వరూపులారా!

ఈశ్వరేచ్ఛకు ప్రకటనయే - ఈ సృష్టి. దీనికే ప్రకృతి అని పేరు. అనగా ఈ ప్రకృతి అంతయూ ఈశ్వరేచ్ఛ స్వరూపమే. ఈ ప్రకృతి యందు పుట్టిన ప్రతి ప్రాణికి ఈశ్వరీయ గుణమే ఉండాలి - ఉండితీరాలి. ఈశ్వరేచ్ఛను ప్రకటన గావించే నిమిత్తమై మానవుడు ఈ ప్రపంచములో మూర్తీభవించాడు. విత్తనము మొలకెత్తి, అందులోని సౌందర్యం పుష్పంగా వికసించినట్లు, ఈ మొక్క, ఆకులు, కొమ్మలు, రెమ్మలు పుష్పము యొక్క పరిణామ దశలే. అటులనే సమస్త సృష్టికి దైవమే బీజము. అట్టి దైవము ప్రతి ప్రాణి యందు విత్తనము వలె ఉంటుండి, దానియొక్క చిగుళ్ళే గుణములుగా వికసించి, కొమ్మలు, రెమ్మలే భక్తి, శ్రద్ధలుగా ఉండి— "సచ్చిదానందమే" పుష్పముగా వికసిస్తూ వస్తుంది. విత్తనము-మొక్క కావలెనన్న దీనికి భూమి, జలము తోడు కావాలి. అటులనే మానవుని యందున్న దివ్యత్వమనే విత్తనము మొక్కగా ఏర్పడి, వృక్షముగా అభివృద్ధిపొంది, 'సచ్చిదానందం' అనే పుష్పము వికసించవలెనన్న, దీనికి భక్తి, శ్రద్ధ అనేవి రెండూ తోడుకావాలి.

## ఆధ్యాత్మికము — భక్తి

మానవత్వమనేది కేవలం దైవము వైపున మనస్సును మరల్చటం కాదు. మానవుని యందు దైవము అవతరించాలి. ఈశ్వరశక్తి అనంత ఆవిర్భావ కళలే మానవత్వం. అనంత వ్యక్తీకరణములోపల కొన్ని కిరణముల స్వరూపమే మానవుడు. ఇట్టి దివ్యమైన మానవత్వమును గుర్తించుకొనలేక, కేవలం లౌకికమైన, భౌతికమైన, తుచ్ఛమైన వాంఛల నిమిత్తమై పవిత్రమైన జీవితాన్ని నిరర్థకం గావించుకొంటున్నాము. ఆధ్యాత్మికము అంటే ఏమిటి? చైతన్యము యొక్క అప్రతిహత సాహసమే. మానవుని వెలుపల నుండి, లోపల నుండి వెలువడే ఈ దివ్యమైన చైతన్యమును స్వచ్ఛముగా ప్రకటించటమే ఆధ్యాత్మికము. ఆధ్యాత్మికమనగా మానవుని యందు శేషించివుండిన పశుత్వమును దూరము చేసి, దివ్యత్వమును అభివృద్ధి గావించుకోవటమే ఆధ్యాత్మికము. దైవమునకు - ప్రకృతికి మధ్యనున్న భేదమును నిర్మూలముచేసి, సమరసము గావించటమే ఆధ్యాత్మికము. ఇట్టి దివ్యమైన, భవ్యమైన, స్థితిని పొందుటకే భక్తి అవసరము.

భక్తి అనగా ఏమిటి? మానవుని మనస్తత్వమునందు ఈశ్వరత్వం అవతరించాలి. తన మనస్సును భగవంతుని యందు స్థిరంగానిల్పే నిమిత్తమై చేసే ప్రక్రియలే భక్తి స్వరూపాలు. లౌకికమైన వాంఛలు నెరవేర్చుకొనే నిమిత్తమై ప్రాకృతమైన విషయవాసనలు అనుభవించే నిమిత్తమై దైవమును స్మరించటమనేది భక్తి కాదు. తన యందు పూర్ణమై ఉండిన సచ్చిదానంద స్వరూపమును ఆవిర్భవింప చేసుకొని అనుభవించటమే భక్తి.

"దేవుడనగ వేరు దేశమందునలేడు-
దేవుడనగ తనదు దేహమందె"

ప్రాచీన కాలము నుండి మానవుడు బాహ్యమైన అర్థమునే ఆధారముగా చేసుకొని, లౌకికమైన ఆచారములే ప్రధానముగా భావించుకొని జీవించుతూ రావటం చేతనే, నిత్య సత్యమైన చైతన్య తత్త్వాన్ని తాను విస్మరిస్తూ వచ్చాడు గుణబద్ధమైన మానవుడు దైవాన్ని విస్మరిస్తాడు. ఆధ్యాత్మికబద్ధమైన మానవుడు ప్రకృతిని విస్మరిస్తాడు. గుణబద్ధమైన మనస్సును మనము ఈశ్వర బద్ధమైన మనస్సుగా మార్చుకోవటం ఆధ్యాత్మికము. ఇట్టి దివ్యత్వమే జగత్తునకు ప్రధానం అనే సత్యాన్ని గాఢంగా విశ్వసించాలి. మంచితనమునకు మారుపేరే దేవుడు. తన మంచితనమును, తన యందున్న పవిత్రమైన గుణములను విశ్వసించి, ఆచరించి, ఆనందించుకోవటమే ఈ చేతనా శక్తి యొక్క ప్రభావం. కనుక ఆధ్యాత్మికమనగా, భక్తి ప్రపత్తులనగా-సత్యమైన అర్థమును గుర్తించలేనివారు నూటికి నూరుమంది ఉంటున్నారు. జీవితమంతయు బాహ్యమైన, లౌకికమైన విషయ వాసనలలో మునిగిపోతున్నప్పుడు, దివ్యమైన భావము తనకు ఏరీతిగా గోచరిస్తుంది? కానీ, క్రమక్రమేణా కొంతవరకైనా దీనికి సాధన అత్యావసరము. ఈ ప్రపంచములో కణము కణమునందు, జీవితములోని క్షణము క్షణము నందు నిరంతరం తేజోమయమూర్తిని ఆవిర్భవింప చేసుకొన్నప్పుడే మానవత్వం సార్థకమవుతుంది.

## చాతకపక్షి - స్వాతిబిందువు

భగవంతునకు నివాసమైన శుద్ధమానసం ప్రతి భక్తునకు పవిత్రమైన స్థానం. మానవుని మనస్సున పవిత్రమైన, శాశ్వతమైన, సత్యమైన తలంపులు ఆవిర్భవింప చేసుకోవాలి. ఇట్టి పవిత్రమైన భావములను ఎవ్వరు తనయందు ఆవిర్భవింప చేసుకొనునో, అట్టి వాని జన్మయే సార్థకము. చాతకపక్షి స్వాతి వర్షబిందువునకై అనేక కష్టములను అనుభవిస్తుంది. కారుమేఘములు చూచినంతనే, తన దీక్షను ప్రారంభిస్తుంది. ఈ ధరణిలో కావలసినంత జలము ఉంటున్నది. కానీ, ఈ చాతకము ఈ మలినజలమును ఆశించదు. స్వాతి కార్తిలోని స్వాతిబిందువుకై, జలధరం నుండి కురిసిన ఈ శుద్ధమైన వర్షబిందువునే ఆశించునుగానీ- నిల్చిన నీరునుగానీ, ప్రవహించే నీరునుగానీ తాను ఆశించలేదు. భయంకరమైన ఉరుములకు తాను ఏమాత్రము భయపడదు. మిరుమిట్లుగొలిపే మెరుపులకు తాను వెరువదు. అదరక-బెదరక, కదలక స్థిరమైన భావముతో మేఘబిందువులకై తాను తపస్సు చేస్తుంది. ఆ జలబిందువుకై "పీ-పీ" అని తన ఆనందమును వ్యక్తం చేస్తుంది. ప్రీతికి ప్రతినిధి ఈ చాతకము. నిజమైన భక్తుడు ఇట్టి తపస్సును ఆచరించాలి. ఇట్టి దీక్షను వహించాలి. ఆశించిన ఆనందమును అనుభవించటానికి ఈ కఠోరమైన సాధన చెయ్యాలి. లోక సంబంధమైన మెప్పులకు గాని, సుఖములకు గాని, విషయ వాసనలకు గాని, పరువు ప్రతిష్ఠలకుగాని తమ పవిత్రమైన జీవితమును పాడు చేసుకోరాదు. బంగారమువంటి మానవ జీవితమును భగవత్ నామమనే 'గీటురాయి'పైన గీటుపెట్టాలి. ఇట్టి సులలితమైన మార్గమును అనుభవించక, అతికష్టతరమైన మార్గమునే తాను ఆచరిస్తూ తనయొక్క విలువైన జీవితమును నిరుపయోగము చేసుకొంటున్నాడు. మానవుడు - మానవుడే కాదు. మానవుడు దేవుడు. తనయందున్న దైవత్వాన్ని క్రమక్రమేణా విషయ వాసనలలో వ్యర్థము చేసుకొంటున్నాడు. అందుచేత తనలో ఆవిర్భవించిన దివ్యమైన భావాన్ని సాత్వికమైన మార్గములో ప్రవేశపెట్టాలి.

## చీమ

ప్రతి ఒక్కడు "దేవుడు - దేవుడు" అనే పదములను మాత్రమే ఉచ్చరిస్తున్నాడే గాని, "దేవుడు" అన్న ఆపదమును తెలుసుకోవటానికి తగిన కృషి చేస్తున్నాడా? మంచితనమునకు మారుపేరే దేవుడు. ఆ మంచితనము మనలో ఎంత ఉంది? అది లేనప్పుడు ఈ దైవత్వం ఎట్లా అర్థమవుతుంది? ప్రతీదానికి ఒక స్వానుభవం కావాలి. లోతుగా ప్రవహించే గంగాజలంలో చిన్నచేప పైన తేలుతూ ఆనందముగా ఆడుకుంటూ ఉంటుంది. ఆ ఈత తెలిసిన చేపకు లోతు సంగతి అక్కరలేదు. కానీ పెద్దశరీరమైన ఏనుగైనా గంగలో మునిగినప్పుడు కొట్టుకొనిపోతుంది. ఆ జలప్రవాహము నుండి రక్షించుకొని, ఆ ప్రవాహము ద్వారా తాను రక్షింపబడే శక్తిసామర్థ్యములను గుర్తించాలి. మట్టిలో చక్కెర కలిసినప్పుడు చిన్న చీమ ఆ చక్కెరను తాను వేరుగావిభజిస్తుంది. చక్కెర రుచి ఆ చీమకు తెలిసినది కనుకనే, ఆ చక్కెరను ఇసుక నుండి వేరుచేస్తుంది.

కానీ, ఆ చక్కెర మాధుర్యమును, రుచిని తెలియని ఎంత పెద్దప్రాణి అయినా ఆ చక్కెరను వేరుచేయటం సాధ్యముకాదు. అవిధముగనే దైవప్రేమను, దైవానందమును, సచ్చిదానందమును చక్కగా అనుభవించిన వాడు, ఈ అనవసరమయిన, లౌకికమయిన మార్గములో పోగలడా? అది తెలియనివాడే ఈ లౌకికములోపల ప్రవేశిస్తాడు. అది తన యందే వుంటున్నది. అన్ని పవిత్రమైన, దివ్యమయిన భావములు తన నుండియే ఆవిర్భవిస్తాయి.

## ఆత్మ వజ్రమువంటిది

అనేక ముఖములతో ప్రకాశమును వెదజల్లేటటువంటి వజ్రము యొక్క కాంతి ఎటువంటిదో, ఆత్మ యొక్క కాంతి అటువంటిది. ముఖములు వేరు, వేరుగానీ, వజ్రం ఒక్కటే. అదే విధముగనే, ఆత్మఅనే ఈవజ్రము నుండి అనేక నామములనే కిరణములు ప్రకాశిస్తూ ఉంటాయి. జగత్తంతయూ ఒక్కసచ్చిదానంద స్వరూపమే. కానీ, మానవుడు కామ క్రోధాది గుణములకు వశుడై తన యందున్న 'సచ్చిదానందనిధి'ని తానుదూరము చేసుకొంటున్నాడు. మానవుడు ఈ సత్యాన్ని గుర్తించుకోలేక రెండు గుఱ్ఱములమీద సవారిచేసి ప్రమాదమునకు గురియైపోతున్నాడు. ఈనాటి పరమభక్తులకు ప్రకృతీ కావాలి, పరమాత్మడూ కావాలి. ప్రకృతి వేరుగలేక, పరమాత్మలోనే ఉన్నదన్న సత్యాన్ని గుర్తించిపుంటే— ప్రకృతిని ప్రత్యేకంగా కోరేవాడు కాదు ఈ మూర్ఖుడు. పాలలోనే, నెయ్యి ఉన్నదనే సత్యాన్ని గుర్తిస్తే, పాలు చేతిలో పెట్టుకొని నేతికోసం పాకులాడడు.

## పారాయణకాదు—ఆచరణ కావాలి

ఈనాటి భక్తులు, ఈనాటి సాధకులు ఈ పవిత్రమయిన సత్యాన్ని గుర్తించుకోలేకపోతున్నారు. శాస్త్రములు, వేదములు, ఉపనిషత్తులు భాగవతం, భారతం, గ్రంథరాజము, ఖురాను, ఇత్యాది గ్రంథములే ప్రధాన లక్ష్యములుగా ఉంచుకొని, గ్రంథముల యొక్క ఆజ్ఞలనే శిరసావహిస్తున్నారేగానీ, ఆచరణ మాత్రం శూన్యమవుతున్నది. ఈలాంటి వ్యక్తులంతా అంధులని చెప్పవచ్చు. శాస్త్రములో భగవంతుని తత్త్వము ఈ రీతిగా చెప్పబడింది, ఉపనిషత్తులలో భగవంతుని గుణగణములు ఈరీతిగా వర్ణించి ఉంది అని తెలుసుకొన్నంత మాత్రమున తాను తెలివిగలవాడవుతాడా? గ్రంథములు చూస్తున్నాడేగానీ, తన ఆచరణ చూడటంలేదు. అంధుడు ప్రపంచము ఉన్నదని వింటున్నాడేగానీ, ప్రపంచమును వాడు చూడలేదు. ఈఅంధునికి మరియు ఈఉపనిషత్సారం, ఈవేదసారం, శాస్త్రసారం చదివి, ఉపదేశము చేసేవానికి ఏమాత్రము భేదము లేదు. కేవలం భౌతికమయినశరీర అంధుడు వీడు, మానసిక శరీర అంధుడు తాను. ఎన్నో ఉపనిషత్తులు చదివినాను, ఎన్నో వేదములు చూచాను, ఎన్నోశాస్త్రములు చదివాను అంటున్నాడేకానీ, ఆచరణలో శూన్యమే. ఈగ్రంథములన్నీ ఆచరణ యోగ్యములైనవేగానీ, కేవలం పారాయణ గ్రంథాలు మాత్రంకావు. కానీ, ఈనాటి మానవులందరూ ఈ పవిత్రమైన గ్రంథములను పారాయణ గ్రంథములుగా ఉపయోగపెడుతున్నారు.

ప్రేమ స్వరూపులారా! శాస్త్రములు చదువవలసినదే, వేదములను అభ్యసించ వలసినదే, ఉపనిషత్తులను చూడవలసినదే కానీ వాటిని పారాయణ గ్రంథములుగా మనము పఠించరాదు. ఈనాడు "గీతాపారాయణ చేయండి చేయండి" అంటారు. ఇటువంటి మూర్ఖగురువులు పుట్టుట చేతనే, మూర్ఖ శిష్యులు తయారైపోతున్నారు. పారాయణచేస్తే వచ్చిన ఫలితమేమిటి? "లడ్డు, లడ్డు" అని పారాయణ చేస్తే లడ్డు నీచేతికి వస్తుందా? మద్రాసుకు పోవాలనుకొని రోడ్డుపై "మద్రాసు మద్రాసు" అంటే మద్రాసు చేరుతావా? నీవు ఆ రోడ్డులో ప్రయాణం చేయాలి. అనేకమంది మూర్ఖ జనులంతా పారాయణ అని మొదలు పెట్టారు. లలితాసహస్రపారాయణ, దేవీసహస్ర పారాయణ, గీతా పారాయణ- ఇవన్నీ పారాయణ చేసిన లాభమేమిటి? నూరు శ్లోకాలు చెప్పేబదులు ఒక్క శ్లోకము నీవు ఆచరణచేయి. ఆచరణలేని పారాయణ అనర్థము. సత్ చిత్ ఆనందము యొక్క సంపూర్ణమయిన అర్థము మనం గుర్తించాలి. సత్-భగవంతుడు. చిత్ జీవాత్మ. ఈ సత్ చిత్ రెండూ కలిసినప్పుడే ఆనందము. సత్ సత్‌గా, చిత్ చిత్‌గా ఉంటే ఆనందము నీకెక్కడ లభ్యమవుతుంది? దుఃఖమే ప్రాప్తిస్తుంది.

## భక్తులు - సాధకులు

నీవు లైటు కావాలని ఆశించినప్పుడు, బల్బు ఉండాలి, కరెంటు ఉండాలి, ఈ రెండింటిని Connect చేసినప్పుడుకదా! నీకు లైటు లభిస్తుంది. బల్బు చేతిలో పెట్టుకొని, నాకు లైటు రావాలంటే ఎట్లా వస్తుంది? ఇది కేవలం మూర్ఖత్వం. "ఎవరో ఒక శ్రీమంతుడు ఒక గాడ్రేజి బీరువాలోపల ముఖ్యమైన, విలువైన ఆభరణాలంతా పెట్టుకొన్నాడు. దాని బీగము చెవులు తన మొలలో కట్టుకొన్నాడు. దొంగలు వచ్చారు. ఈపెట్టెను పదిమంది సాయంపట్టుకొని ఎత్తుకొని లారీలో వేసుకొని వెళ్లిపోయినారు. వెంటనే ఈ తెలివి తక్కువ మనిషి ఏమనుకొన్నాడంటే, నా మొలలో మాత్రం బీగంచెవులు ఉన్నాయి, పెట్టె తీసుకొనిపోతే నాకేమి? అని అనుకొన్నాడు". ఈరీతిగా భక్తులు, సాధకులు వుంటున్నారు. దేవుడు ఎక్కడ వున్నాడు? నేను గ్రంథాలు చదువుచున్నాను, శ్లోకాలంతా కంఠస్థము చేసుకొన్నాను; కాబట్టి దేవుడు నాదగ్గరనే వున్నాడు. ఈ శ్లోకార్థములకు సంబంధమయిన ఆచరణ ఏ ఒక్కటి యైన ఉండాలి కదా! ఈనాడు ఆచరణ లేదు. ఎక్కడికి పోయినప్పటికిని మన తుచ్ఛభావాలే మన తలంపుకి వస్తూ ఉంటాయి.

## ఆధ్యాత్మిక, సామాజిక సమన్వయం

ఈనాడు లోకములో ఆధ్యాత్మికమంటే లౌకికముతో ఏమాత్రము సంబంధము లేదని భావిస్తారు. లౌకికమంటే ఆధ్యాత్మికంలో యేమాత్రము అనుభవము లేదని చూస్తారు. ఇది చాలా పొరపాటు. ఆధ్యాత్మికం, సామాజికం రెండింటి యొక్క సమరసమే నిజమయిన దివ్యత్వము. దేశ సమైక్యతగాని, జాతి సమగ్రతగాని, ఆధ్యాత్మికమనే ఆధారము చేతనే లభిస్తుంది. సామాజిక జీవితమునకు, ఆధ్యాత్మిక జీవితమునకు అనుబంధమనేది— దివ్యత్వమే. ప్రపంచ-పరమాత్మల సంబంధ బాంధవ్యమనేది అవినాభావ సంబంధము,

అన్యోన్యాశ్రయము. కాబట్టి దైవము వేరు ప్రకృతి వేరు - అనే విభాగము గావించరాదు. ప్రకృతి యందు పరమాత్మను దర్శించడానికి ఒక ఉదాహరణ:— ఇది ఒక టంబ్లరు. దీని రూపాన్నే చూచినప్పుడు, ఇది టంబ్లరని మీరు చెప్పగలరు. ఈ టంబ్లరుకు ఆధారం ఏమిటి? అనుకొంటే వెండి అని తెలుతుంది. వెండిని చూచిన వారికి టంబ్లరు ఏమాత్రము గుర్తుకు రాదు. టంబ్లరు చూచేవారికి వెండి ఏమాత్రం గుర్తుకు రాదు. రెండూ తెలిసినవాడే వెండి టంబ్లరు అని రెండూ కలిపిచెప్పుతాడు. కాబట్టి టంబ్లరు, వెండి రెండూ ఒక్కటే. ఆకారాన్ని చూచేవారు కొందరు, ఆధారాన్ని చూచేవారు మరికొందరు. పరమాత్ముడు లేక ప్రకృతి లేదు. ఈనాడు ప్రకృతినే చూచేవారు అధికంగా వుంటున్నారు. ఈ ప్రకృతి పరమాత్మ స్వరూపమని భావించేవారు చాలా తక్కువ. నేను అనేక పర్యాయములు చెప్పుతూ వుంటాను. ఇది యేమిటి? అంటే ఇది వస్త్రము అంటారు. కానీ ఈ వస్త్రమునకు ఆధారము ఏమిటి? దారము. వస్త్రమును చూస్తారుగాని, దారము చూడరు. దారంలేక వస్త్రం కాలేదు. వెండిలేక టంబ్లరు కాలేదు. మట్టిలేక కుండ కాలేదు. బ్రహ్మములేక ప్రకృతి లేదు. కనుకనే అట్టి సత్య స్వరూపాన్ని, అట్టి సత్య తత్త్వాన్ని గుర్తించుకునే స్వభావం ప్రతిమానవునియందు అవిర్భవించాలి.

## ఇంద్రియాలను జయించు

ఇంద్రియములు మిమ్మల్ని స్వాధీనము చేసుకొని మిమ్మల్ని నడిపిస్తున్నవి. ఈ సత్యాన్ని గుర్తించి ఇంద్రియములను మీరు స్వాధీనపరచుకొని, ఇంద్రియాలను నడిపించండి. మీరు ఇంద్రియాలకు స్వాధీనము కాకూడదు. ఇంద్రియములు మీ స్వాధీనమై ఉండాలి. అప్పుడే ఈ సత్యాన్ని గుర్తించటానికి సాధ్యమౌతుంది. ఎప్పుడు చూచినా ఇంద్రియాల్ని అనుసరిస్తూ-అనుసరిస్తూ పోతుంటే, ఏమి గతైపోతుంది? ఈ విధానము అనేక ప్రమాదములకు గురౌతుంది. అనేక అశాంతులు అనుభవిస్తుంది. దివ్యమైన భావాన్ని మరుగు పరుస్తుంది. ప్రతీ వ్యక్తి తనయొక్క దోషములను తాను గుర్తించటానికి ప్రయత్నించడు. తన దోషములను సమర్థించుకొని, పరుల యందున్న సుగుణములను కూడా దోషములుగా రూపొందింపచేస్తాడు. కనుకనే మానవుడు దానవుడుగా మారిపోతున్నాడు. మానవుడు పశువుగా మారిపోతున్నాడు. తన తప్పును తాను సమర్థించుకొనుటకై అనేక విధములైన పాట్లుపడుతాడు. ఏ స్థానము నందున్నాము, ఏమి చేస్తున్నాము, ఏ లోటు కలిగింది? అనే విచారణ ఏమాత్రం చేయడు. అన్నింటికిని మూలకారణము స్వార్థమే. ఏ పదార్థమును తాను ప్రేమించినప్పటికిని, పదార్థనిమిత్తమై పదార్థములను ప్రేమించుటలేదు. తన నిమిత్తమై పదార్థములను ప్రేమిస్తున్నాడు. ఏ వ్యక్తిని ప్రేమించినప్పటికిని, వ్యక్తినిమిత్తమై వ్యక్తిని ప్రేమించుటలేదు. తన నిమిత్తమై వ్యక్తిని ప్రేమిస్తున్నాడు. భగవంతునిపైన కూడా ఇదే స్థితి. భగవంతుని ప్రేమిస్తున్నాను - ప్రేమిస్తున్నాను అంటున్నాం. కాదు కాదు. తన నిమిత్తమై భగవంతుని ప్రేమిస్తున్నాడు. కాని భగవంతుని నిమిత్తమై తాను ప్రేమించేవాడు. తన తత్త్వమును మరచిపోవాలి. నిజమైన ప్రేమకు అనురాగం

ఉండదు. తన నిమిత్తమయి తాను ప్రేమించే ప్రేమను అనురాగమని అంటారు, భగవంతుని నిమిత్తమై ప్రేమించేదానిని ప్రేమ అంటారు. ప్రేమకు అనురాగమునకు ఇంత వ్యత్యాసము ఉంటుంది.

## కృతజ్ఞత - కృతఘ్నత

స్వార్థము, స్వప్రయోజనము ఈ రెండే మానవుని ప్రధానమైన గుణములు. తద్వారానే దివ్యమైన శక్తిని గుర్తించుకొనలేకపోతున్నాడు. ఎన్ని సాధనలు చేసినప్పటికిని, ఎన్ని గ్రంథములు పఠించినప్పటికిని, ఎన్ని ధ్యానములు చేసినప్పటికిని, ఎన్ని జపములు ఆచరించినప్పటికిని, ఎన్ని భజనలు చేసినప్పటికినీ— లోతుగా పాతుకుపోయిన స్వప్రయోజన మాలిన్యమనేది అంత సులభంగా, శుభ్రము కాలేదు. తనలో ఉండిన దుర్గుణములను, దుర్భావములను, దురాలోచనలను దూరము గావించినప్పుడే, ఆ దివ్యత్వమనేది ఆవిర్భవిస్తుంది.

కృతఘ్నత అన్నదే ఒక పెద్ద పాపం. ఈ పాపమే మానవుని తలవంచి అనేక విధములైన బాధలకు గురిచేస్తుంది. ఎవరివలన నేను ఈ స్థాయికి రాగలిగితినని, ఎవరివలన నేను ఈ కీర్తిని అనుభవించగలిగితినని, ఇంతటి అభివృద్ధికి ఎవరు కారణం? అనే ఉపకారమును మరచిపోతున్నారు. ఈ ఉపకారమును మరచినవాడు దైవదృష్టిలో చచ్చినవానితో సమానము. కనుక కృతజ్ఞతలేనివాని జీవితము చావుతో సమానము. ఎవరివల్ల నీవు ఈ ఉపకారమును పొందావో, వారికి కృతజ్ఞతను నీవు చూపించాలి. ఈనాడు నీవు పెద్దవాడు కావచ్చును, విద్యావంతుడు కావచ్చును, నీవు ధనవంతుడవు కావచ్చును, అధికారివి కావచ్చును— కానీ, ఈ స్థాయి ఎవరివలన వచ్చింది? అనేవిషయం మరచిపోవుచున్నారు. కనుకనే మానవుడు తన విలువలనన్నింటిని నిర్మూలం చేసుకొంటున్నాడు. ఈ అహంకారము, ఆడంబరము, ఆత్యాశ మానవత్వాన్ని పూర్తిగా భస్మం చేస్తోంది.

## తల్లిదండ్రులు

ప్రేమ స్వరూపులారా! మీ అహంకారములు, అభిమానములు దూరముచేసి ప్రేమ తత్త్వాన్ని అభివృద్ధిని గావించుకొని, స్వార్థాన్ని విడిచి పెట్టండి. స్వార్థం వుండాలి-ఎంతవఱకో అంతవఱకు. నియమమే లేకపోతే, మానవుడు చాలా ప్రమాదములకు గురౌతాడు. ఈనాటి మానవత్వములో 'తల్లి-తండ్రి' అనే గౌరవము పూర్తిగా శూన్యమయిపోయింది. పెంచి, పెద్ద చేసి రక్తాన్ని, కూడు,గుడ్డలను పంచియిచ్చి, అనేక విధముల పోషించిన తల్లిదండ్రులనే తృప్తిచేయలేనటువంటి ఈ మూర్ఖుడు చచ్చినవానితో సమానముకాక, ఇంక బ్రతికినవానితో ఎట్లా సమానమవుతాడు? మన శాస్త్రములన్ని- "మాతృ దేవోభవ, పితృ దేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ" అని పల్కినవి. మాతాపితరులను సరియైనదృష్టిలో పెట్టుకోలేనివాడు ఇంకేమి ప్రయోజనము? కాబట్టి, తాను ఏరీతిగా తల్లిదండ్రుల గర్భమునుంచి జన్మించినాడో, అదేరీతిగనే ఈ సమాజము కూడ ఆ సచ్చిదానందము అనెడు గర్భము నుండియే ఆవిర్భవించినది.

## "శి - వ - రా - త్రి"

ఈ ప్రపంచమంతా పరమాత్మ స్వరూపముగా మీరు విశ్వసించండి. ఇదియే శివరాత్రి మహాత్మ్యం. మానవునికి ఉండిన పది ఇంద్రియములే ఇన్ని విధములైన మార్గములలో ప్రవేశపెడుతున్నాయి. అనేక పర్యాయములు చెప్పాను. శి - వ - రా - త్రి నాలుగు పదాలు. ఈ వర్ణాక్షరములందు, సంఖ్యాక్షరములందు అనేక సంబంధ బాంధవ్యములుంటున్నాయి. "శి" అనగా 5 సంఖ్య. "వ" అనగా 4 సంఖ్య. "ర" అనగా 2 సంఖ్య. ఈ 5+4+2=11 అవుతుంది. పంచ కర్మేంద్రియములు, పంచ జ్ఞానేంద్రియములు, మనస్సు కలిపి 11 అవుతుంది. ఈ పదకొండే- ఏకాదశరుద్రులు. ఈ రుద్రులు చేసే పని ఏమిటి? మానవుని విషయ వాసనలలోనెట్టి, తుచ్ఛమయిన వాంఛలను పెంచి, భౌతిక జీవితంలో పడవేస్తుంది. ఈ 11కు అతీతమైనది మరొకటి ఉంటున్నది. అది "త్రి". అదియే పరమాత్మ. ఈ పంద్రెండవ దానిని మనము పట్టినప్పుడే, మనము ఈ ఇంద్రియములను సాధించినవారమవుతాము. ఈపంద్రెండు సూత్రం మనం జాగ్రత్తగా పెట్టుకోవాలి.

## జాగరణ

శివరాత్రి - శివరాత్రి మంగళకరమైన రాత్రి. దేనివలన మంగళకరం? ఈ దినము చతుర్దశి. 16 కళలలో 15 కళలు అంతర్ధానమై ఒక్క కళమాత్రమే కన్పిస్తుంది. ఇది అతిసమీపమయిన మార్గం. అతి సన్నిహితమైన మార్గం. అలాంటి సమయంలోపల ఈ ఒక్కరాత్రి అయినా ఈ పదియింద్రియాలను, మనస్సును మనము వశంచేసుకుంటే, తప్పక మనకు దివ్యత్వం ప్రాప్తిస్తుంది. ఈ ఒక్కరాత్రియైనా ఏ లౌకిక భావమునకు చోటివ్వక మనస్సును స్వాధీనం చేసుకుని, తగిన స్మరణచేస్తే, తప్పక అందులో దివ్యమయిన తత్త్వము ఆవిర్భవిస్తుంది. దీనినే 'జాగరణ' అన్నారు. నిజమైన జాగరణ ఇంద్రియాలను స్వాధీనం చేసుకొని, పరతత్త్వములో మనస్సు నిలపటమే జాగరణ. ఇట్టి జాగరణ చేసేవారు ఏ కోటికో, ఏ నూటికో ఒక్కరు ఉండినా చాలు.

## "కే - శ - వ"

దివ్యాత్మస్వరూపులారా!

మీరు దివ్యాత్మస్వరూపులే! కానీ వాంఛలు ప్రాకృతమైనవి కనుకనే, ఈ విధమైన మానవులుగా రూపొందుతూ వచ్చారు. ఈ ప్రాకృతమైన విషయాలు మీరు అనుభవించండి. ఆ అనుభవమును దైవముగానే భావించండి. ఏ దైవనామమును మీరు భేదంగా చూచుకోవద్దండి. "రామ! అనండి, కృష్ణా! అనండి, గోవిందా! అనండి"— ఏమనుకొన్నప్పటికీ, ఇవన్నీ దైవనామములే. కొంతమంది మూర్ఖులు "శైవులు—వైష్ణవులు" అని భేదాలు పెట్టుకొని, "శివనామము"ను ఏమాత్రము స్మరించరు, వినరు. ఈ భేదాలు మాత్రము దూరం చేయండి, అభేద తత్త్వాన్ని అందించి, ఆనందించండి.

మాయా వాదమునకు గానీ, అద్వైతవాదమునకు గాని, సాంఖ్య వాదమునకు గాని, చార్వాకమునకుగాని, అన్నివాదములకు కేశవ నామము ప్రధానం అన్నారు. ఇదియే మూలా

ధారము అన్నారు. ఏమిటి ఈ కేశవనామములో ఉన్న అంతరార్థము? క- ఈశ- వ- ఇతికేశవ క-బ్రహ్మ, ఈశ- ఈశ్వరుడు, వ- విష్ణువు. ఈ సృష్టి స్థితి లయములకు అంతా కేశవనామమే ఆధారము. శూన్యవాదమునకు ఈ కేశవ నామమే ఆధారము. ఈలాంటి అంతరార్థములను గుర్తించుకొనలేకపోవుచున్నాడు నేటి మానవుడు.

## శివకేశవుల అభేదతత్త్వం

"ఎద్దునెక్కినా - గ్రద్దనెక్కినా ఇద్దరు ఒక్కటే ఓ నరుడా! 'లింగ లింగ - శివలింగ లింగ' యని 'రంగని' తిట్టకు ఓ మనసా! ధన ధాన్యంబులు ఎన్నివున్నను దరికిరావురా ఓ నరుడా! పరమపావన పరమశివుని శరణనుము ఓ నరుడా! పరమేశ్వరుని శరణుజొచ్చు. అదే జీవిత పరమానందం. అప్పుచేసుకొని యాత్రలు చేయుట తప్పు తప్పురా! ఓ నరుడా! జీవాత్మ లోన-పరమాత్మ కలడని చక్కగ తెలియుము ఓ నరుడా! ఆడంబరములు అవల నెట్టి ఆత్మ దర్శనము చేయుమురా! జాగుచేయక జీవిత మంతయు "ఓగుచుక్క" వలె గడుపుమురా! చదువుసంధ్యలు ఎన్ని నేర్చినా, స్వామి సేవలు దొరకవురా! మధురమైన ఆ నామము తలచిన మార్గమునకే చూపునురా! చెప్పేమాటలు పెడచెవిని పెట్టి, తప్పులు చేయకు ఓ నరుడా! అగ్నివంటి ఈ సత్యము కనుగొని గొప్ప మార్గమున నడువుమురా!" అట్టి దివ్యమైన, పవిత్రమైన మార్గాన్ని అనుసరించి, తరించి, వరించి, భ్రమించి— ఆనందాన్ని అనుభవించండి.

## అన్ని నామముల సారము ఒక్కటే

'శివ-శివ' యని రంగని తిట్టకూడదు. 'రంగ-రంగా! ఓ పాండురంగా!' యని శివుని తిట్టకూడదు. ఈనాడు అట్లులేదు. 'శివ-శివ' యంచును రంగని తిట్టుదురు. ఇది సరియైన భక్తి కాదు. దైవత్వం- అనేకత్వంలో ఉండిన ఏకత్వమే. ఈనాటి భక్తి అంతా సంకుచితమైన మార్గంలోనికి దిగజారిపోయినది. రాముడన్న వానికి - కృష్ణుడంటే ఇష్టం లేదు. కృష్ణుడన్న వానికి - రాముడంటే ఇష్టంలేదు. ఈ విధమైన భావములున్నవాడు నిజమైన మానవుడే కాదు. మానవుడు కానటువంటివానికి మాధవత్వము ఎట్లా అర్థమవుతుంది? "నాకు రాముడంటే చాలా ఇష్టము. రామనామం చెప్పినా, చేసినా ఆనందభాష్పాలు రాల్తాయి" అంటారు. కానీ, ఆ రామనామాన్ని మార్కెట్టులో పెట్టి అమ్ముతున్నారు. ఆ దివ్యమైన రామనామాన్ని చెవిలో ఉపదేశం చేయటం - చేతిలో డబ్బులు గుంజటం. ఇటువంటి తుచ్ఛమైన మార్గాన్ని ప్రక్కకు నెట్టండి. ఇట్టి ప్రబోధలు మీరు ఏమాత్రము వినవద్దు. సర్వులయందు దైవము ఉంటున్నాడు. అందరిని గౌరవించండి, అందరిని ప్రేమించండి. అన్నింటిని మీరు ఆనందంగా అనుభవించండి— "అన్ని నామముల సారము ఒక్కటే" అని భావించండి. ఈ భావంతోనే భగవన్నామాన్ని స్మరించండి. ఆ భజనల చేతనే మానవత్వము ఏకత్వమయి పోతుంది.

—శ్రీవారి దివ్యబోధ
పూర్ణచంద్ర ఆడిటోరియం
ప్రశాంతినిలయం, 12-2-1991.



# నామస్మరణలో సమత్వాన్ని పాటించు



ప్రేమస్వరూపులారా!

ఇంద్రియములతో కూడిన ఈ పాంచభౌతిక శరీరము మనస్సు నుండి వేరుకాదు. ఈ శరీరమును మనస్సు తన విలాసార్థమై నిర్మించుకొన్న భవనము. సమస్త ఉపాధులకు మనస్సే మూలకారణం. మనస్తత్త్వమును పురస్కరించుకొనియే జగత్తు జరుగుచున్నది. ఈ మనస్సు సంకల్ప, వికల్పములతో కూడిన స్వరూపము. సంకల్పబీజము చేతనే, కర్మ ఫలము సిద్ధిస్తుంది. కర్మవర్తనము చేతనే భావములు ఏర్పడుతూ ఉంటాయి. భావబీజం వలననే, అభ్యాసం ప్రాప్తిస్తుంది. అభ్యాసబీజము చేతనే, శీలం చేకూరుతుంది. శీలబీజము చేతనే, అదృష్టము కలుగుతుంది. మానవుని అదృష్ట - దురదృష్టములు శీలముపైననే ఆధారపడి ఉంటుంది. శీలమే అన్నింటికిని కారణం.

## మనస్సు - శీలము - సంకల్పం

శీలమునకు అభ్యాసములే మూలం. అభ్యాసములకు భావములే కారణము. భావములకు సంకల్పములే మూలం. సమస్త సంకల్పములు కర్మల చేతనే ఏర్పడుచున్నవి. కనుకనే- "కర్మాను బంధీని మనుష్యలోకే" అన్నారు. మానవ జీవితమంతయు, కర్మ చేతనే కట్టబడియున్నది. "నీరులేని పంట అస్థిత్వము - ఎంత మిథ్యామాత్రమో, మనస్సులేని జీవితము అస్థిత్వము - అంత మిథ్యామాత్రమే". నీరులేని పంట, కరెంటు లేని వైరు, పండితుడులేని బడి, దేవుడులేని గుడి, మనస్సులేని జీవితం అంతా వ్యర్థం. దేవుడు లేకుండా మందిరం నిర్మించరు. పంతులు లేకుండ విద్యార్థిచేరడు. కరెంటు లేకుండా వైరు ఉండదు. నీరు లేకుండా పంట పండదు. మనస్సు లేకుండా జీవితము నిండదు. కనుక అన్నింటికి మూలకారణము మనస్సే. మన అదృష్ట - దురదృష్టములన్ని మనస్సుపైన ఆధారపడి ఉన్నవి. మనస్సును నిర్మలంగా ఉంచుకోవటం, సంకల్పము లను పవిత్రముగా ఏర్పరచుకోవటము మానవునికి ప్రధానమైన విధి.

## మనస్సును మిత్రునిగా చేసుకో

క్రూరుడు, దయారహితుడు, కఠినహృదయుడైన రత్నాకరుడు మహర్షుల బోధల చేతను, వారి సంకల్పముల చేతను తాను వాల్మీకిగా మారగలిగినాడు. అతని సంకల్ప ప్రభావము చేతనే పవిత్రమైనటువంటి రామాయణ మహాఘట్టమును వ్రాయుటకు నాయకుడుగా తయారు కాగలిగినాడు. అందుచేతనే, అతని కీర్తి ప్రతిష్ఠలు జగద్విఖ్యాతిని గాంచినవి. శ్లోకదాతుడు వాల్మీకిగా తయారైతే, లోకదాతుడు ఈశ్వరుడుగా

మారినాడు. ఈ హేతువుచేత, లోకదాతకు సమానమైన స్థాయికి శ్లోకదాతుడందుకోగలిగినాడు. ఇట్టి పవిత్రమైన ఉన్నత స్థాయిని పొందుటకు కారణమేమి? అతని సంకల్పమే మూలకారణం. సంకల్పము పవిత్రమైనప్పుడే, సమస్త అదృష్టములు మనలను చేరుతాయి. ఈ సంకల్పములు దుష్టమైనవిగా ఉండినప్పుడే, సమస్త దురదృష్టములు మన వెంట చేరుతాయి. కనుక, కలిసి వచ్చినవేళ, మట్టి కనకమేయగును. కర్మచాలకున్నచో కట్టియే పామై క్రాలును. మన సంకల్ప, వికల్పముల వల్లనే అదృష్ట, దురదృష్టములు మనలను వెంటాడుతూ ఉంటాయి. వీటన్నింటికి ఇంద్రియములే మూలకారణం. మనము ఇంద్రియములను స్వాధీనం చేసికోవలెనన్న, దీనికి Master అయినటువంటి మనస్సును అరికట్టుకోవాలి. మనస్సును మిత్రునిగా చేసుకోవాలి.

## శివరాత్రి అంటే ఏమిటి?

విద్యార్థులు, విద్యార్థినిలు నేటి రాత్రంతయూ ఎంతో అత్యంత భక్తిశ్రద్ధలతో గానము చేసినారు. భగవత్ నామమునందు సమత్వాన్ని వహించి దివ్యత్వాన్ని చేపట్టి దైవత్వాన్ని చేరండి. ఈనాడు ఎంతో పవిత్రమైన సుదినం. పూర్ణచంద్రుని రాత్రి "పూర్ణిమ" అంటారు. రాత్రి అంటే ఏమిటి? రాత్రి అనగా చీకటితో కూడినదని అర్థం. ఈనాడు శివరాత్రి అనగా నేమి? మంగళకరమైన రాత్రి. నేటి రాత్రంతయూ భగవన్నామ స్మరణచేత పవిత్రము చేసుకొనుటచేత ఇది మంగళకరమైన రాత్రిగా పేర్కొన్నారు. ఈ భగవన్నామమును ఎంత పరిశుద్ధమైన హృదయముతో ఎంత పవిత్రమైన భావముతో ఉచ్ఛరిస్తారో, అంతకు అంత పవిత్రత, పుణ్యము మనకు లభిస్తుంది. ఆ పవిత్రతను పొందినప్పుడు జీవితంలో సర్వమూ పవిత్రమైపోతుంది. ఒక్కదానిలో విజయాన్ని సంపాదిస్తే, అన్నింటిలో విజయాన్ని సాధించగలము.

## భగవన్నామం ఎవ్వరు పాడినా అనుసరించు

ఈనాడు లోకములో మనకు నూతన విద్యలు అవసరం లేదు. అట్లే, నూతన సమాజ స్థాపనకూడా అక్కరలేదు. మనకున్న గుణములు చక్కదిద్దుకుంటే దేశమే బాగుపడుతుంది. యువకుల యందు అహంకారము, దురభ్యాసము, దుశ్చింతలు దూరం గావించుకోవాలి. బజారులో ఉన్న భిక్షకుడు భగవన్నామము చేసుకొంటూ- చక్కగా, హాయిగా గానము చేస్తాడు. తాను భిక్షకుడు (Beggar) కానీ, "భగవన్నామము" భిక్షకుడు (Beggar) కాదు. ఆ నామమును ఎవ్వరైనా, ఎప్పుడైనా గానము చేసినా, హాయిగా శ్రవణము చేయవచ్చును. పాత్రను చూడరాదు. పదార్థాన్ని చూడాలి. ఎవరు పాడుచున్నారని మనం విచారించనక్కర లేదు. అదేవిధముగా ఎవరు పాడినాసరే, ఆ దివ్యనామాన్ని అనుసరించాలి. ఈ నియమాన్ని ఇక్కడ ఉండినప్పుడు మాత్రమేకాదు- "అడవులందున్న, ఆకసమందున్న, గుట్టమీదనున్న, పల్లెయందున్న, పట్టణమందున్న, నట్టేట నిలిచియున్న, మందిరమందున్న, మఠమునందు ఉన్న, ఎక్కడ ఉన్నప్పటికి"— ఆ నామచింతనలో సమత్వాన్ని పాటించాలి. నామస్మరణలో సమత్వాన్ని మనము పాటించినప్పుడు, సర్వవిధములా సమత్వాన్ని మనం పొందవచ్చును, అభివృద్ధిని గావించుకోవచ్చును.

## యవ్వనం కదలిపోయే మేఘం

ప్రేమస్వరూపులారా! వృద్ధాప్యములో మన దేహం క్షీణిస్తుంది. మనస్సు భ్రమిస్తుంది. ఆసమయములో మనము ఏ చింతన చేయలేము. ఏ విధమైన నిగ్రహ శక్తిని సాధించలేము. ఇది అసాధ్యం. అనేక మంది పెద్దలు రిటైర్ అయినతరువాత, భగవత్కార్యములో పాల్గొనవచ్చునని, భగవచ్చింతన చేయవచ్చునని శాస్త్రారం చేస్తారు. ఈనాడు ప్రయత్నపూర్వకముగా

సాధించినప్పుడే, మనము రిటైర్‌మెంటు తీసుకొన్న తరువాత దీనిని సాధించటానికి వీలౌతుంది. మొదట- 'సిపాయి'గా చేరినవాడు, రిక్రూటింగులో తాను ట్రైనింగు పొందనప్పుడు, యుద్ధభూమిలో కత్తిని చేపట్టి ఏ రీతిగా విజయాన్ని సాధించగలుగుతాడు? యవ్వన వయస్సులో, ఇది ఒక రిక్రూటింగువంటిది. ఇందులో సరియైన పద్ధతిలో తర్ఫీదు పొందాలి. "పద పదమని కాలకింకరులు పాశములాగెడు వేళ, దబ దబ బయట పెట్టుడికలాభంలేదని చెప్పెడువేళ, బిలబిల ఆలుబిడ్డలు ఏడ్చెడువేళ హరినామము నోటపల్కుట సాధ్యమా?" కాదు. కాబట్టి అప్పుడు హరినామము చెప్పుకోవచ్చునని పల్కితే, మనకు ఏ రీతిగా సాధ్యమౌతుంది? అట్లు వీలుపడదు. కాబట్టి మన జీవితకాలములో మనము చేసిన అభ్యాసమే, అంత్యకాలములో మనకాదరణగా నిలుస్తుంది. కనుక ఈ యవ్వనము చాలా పవిత్రమైనది. కానీ, అమితకాలము నిలిచేటటువంటిది కాదు. అదికూడ మితకాలమే - కొంత కాలమే. యవ్వనం కదలిపోయే మేఘమువంటిది. మధ్యలోవచ్చి, మధ్యలో పోయేటటువంటిదే ఈ యవ్వనం. మన భావములను పరిశుద్ధపరచుకొనుటకు తగిన కృషి చెయ్యండి.

## సామూహిక భజన ప్రాశస్త్యం

ఒక్క సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ నందు మాత్రమే పవిత్ర భావాలు ఉంటున్నాయి. కానీ ఆ పవిత్రమైన సూత్రమును మరింత పవిత్రము గావించుకోవటము అత్యంతవసరము. ఈ జగత్తును భగవన్నామము తప్ప కాపాడగలిగినది మరొకటిలేదు. ఈ జగత్తును కాపాడుటకు ఆయుధములు కాదు, ఈ జగత్తును కాపాడేది బాంబులు కావు, ఈ జగత్తును భగవదనుగ్రహము మాత్రమే కాపాడుతుంది. ఆ అనుగ్రహమునకు పాటుపడుట మానవుని కర్తవ్యం. కనుక ప్రార్థన చాలా ప్రధానమైనది. రాగ, తాళములతో బాటు భావమును చేర్చినప్పుడే, దివ్యమైన రాగముగా రూపొందుతుంది. లేకపోతే భావములేని రాగం రోగంతో సమానం. అహంకారమును దూరముచెట్టి, ఆడంబరమును అణగద్రొక్కి, వినయవిధేయతలతో, భక్తిశ్రద్ధలతో భగవన్నామాన్ని స్మరించాలి. అదే నిజమైన పద్ధతి. ఆ భగవన్నామముయొక్క విషయాన్ని చక్కగా గుర్తించి వర్తించాలి. త్యాగరాజు చెప్పాడు- "తెలిసి రామ చింతన చేయవే మనసా". అదే విధముగనే నిజజీవితములో, "చూచి త్రొక్కు, తెలిసి మ్రొక్కు". మీరందరూ ఏకకంఠంతో పాడినప్పుడు, ఎంత మనస్సు యొక్క Vibration దివ్యమైన దివ్యశక్తి ఎన్ని విధాలుగా రాణిస్తుంది? ఈ ఐకమత్యంతో కూడిన Vibration సర్వత్రా వ్యాపించిందంటే— జగత్తే మార్పు చెందుతుంది. ఒక్కొక్కరుగా పాడుతూవుంటే, ఆ దివ్యమైన శబ్దం హృదయం స్తంభించిపోతుంది. కనుకనే గురునానక్ సామూహిక భజన అనే దానిని ప్రారంభించినాడు. అందుచేతనే అందరి గానస్వరూపం ఏకమైనప్పుడు, అది ఒక దివ్యత్వంగా మారిపోతుంది.

## క్వాంటిటి కాదు - క్వాలిటి కావాలి

ప్రేమస్వరూపులారా! జీవితము అనేది ఒక కాగితము వంటిది. కానీ, ఇదొక పరిశుద్ధముగా ఉండే కాగితము కాదు. అనేక జన్మల సంస్కారములు, అనేక జన్మల ఫలములు అగోచరంగా చిత్రించబడినవి. అవ్యక్తముగా ఉండేటటువంటిది. కానీ, ఈ కాగితమునకు ఒక వైపున భావము, రెండవ వైపున శబ్దము. భావము లేకుండా శబ్దము, శబ్దము లేకుండా భావము చెయ్యాలంటే— శబ్దమును విడిచి భావము ఉండదు, శబ్దమును వదలి భావమును చిత్రించడానికి వీలు కాదు. ఒక కాగితమునకు ఇరుప్రక్కల ఉండేటటువంటిది. కనుక భావముతో కూడిన శబ్దము రావాలి. ఈ విధమైన గానముచేత, ఈ విధమైన స్మరణచేత, ఒక్క "శివరాత్రి"నాడు మాత్రమే కాదు, నిత్య భజనల యందు కూడా అందరూ కంఠమెత్తి పాడాలి. భగవంతుడు కంఠమెందులకు ఇచ్చినాడు? కేవలము

అసత్యమును పలుకుటకు కాదు, ఇతరుల చింతలు వల్లించటానికి కాదు, భగవన్నామమును పలుకుటకొరకే. అట్లే కన్నులిచ్చినది భగవంతుని చూడటానికే. చెవులిచ్చినది, మంచి విషయాలు శ్రవణము చేయటానికే. నోరు ఇచ్చినది భగవంతుని స్మరించటానికే. "సమ్యక్ కీర్తనం ఇతిసంకీర్తనం" అన్నారు. సంకీర్తన మనగా ఏమిటి? హృదయమునువిప్పి మనలో ఉన్నటువంటి, శబ్దమును ఏమాత్రమూ కించపరచకుండా, స్వేచ్ఛగా, నోరూర, నోరార భగవంతుని నామస్మరణ చేయటమే. మనకున్న శబ్దాన్ని అరికట్టి మనము గానము చేయకూడదు. స్వేచ్ఛగా, తన స్వర మెట్లుందో, అదేరీతిగా అపస్వరమౌతుందనే యోచన లేకుండా పాడాలి. లోకులు భావ, రాగ, తాళాన్ని చూస్తే - భగవంతుడు హృదయాన్ని చూస్తాడు. కనుక ఏ హృదయముతో నీవు పాడుచున్నావో, ఆ హృదయాన్ని మాత్రమే చూస్తాడు. హృదయము Quality, రాగ - తాళ - భావములు Quantity. కనుక మనము Quality ని పెంచుకోవాలి.

## దుర్మార్గుల దుష్ప్రచారములు నమ్మకండి

ఈనాడు మరొక విషయాన్ని మీకు హెచ్చరింపదలచుకొన్నాను- "సాయి స్వభావం ఏనాడూ, ఎవ్వరికీ, ఏ విధమైన అపకారము కాని, కీడు కాని, ఇంకా ఏ విధమైన బాధలుకాని కల్పించేది కాదు". కొంత మంది బయట దేశమువారు, ఈ దేశమువారు, స్వామి ఏదో ఇది చెప్పారు, అది చెప్పారు—— ప్రపంచము కొంత కాలములో మునిగిపోతుందని, పెద్దపెద్ద అవాంతరాలు కలుగుతాయని, దేశము అనేక అవస్థలకు గురి అవుతుందని స్వామి చెప్పినట్లుగా చెప్పి, కరపత్రములువేసి పంచి పెడుతున్నారు. ఇటువంటి భావములు కాని, ఇటువంటి సంకల్పములుకాని సాయిలో ఏనాటికి రావు - రాబోవు, రాలేవు. ఇవి పనిలేనివారు కల్పించుకొనే పనులు. ఏనాడూ మీరు నమ్మకండి. అట్లే కొంత కాలములో దేశమంతా మునిగిపోతుందని, 12 మంది విద్యార్థులను పంపించి దీనిని సరియైన పద్ధతిలో తీర్చిదిద్దుతానని ఇటువంటివి ఒక 90 Points print కొట్టి అందరికీ పంచుతున్నారు ఆ దుర్మార్గులు. భక్తులైనవారు కూడా దీనిని నమ్ముతూ వస్తున్నారు. ఇట్టి విషయాలు ఎవ్వరూ నమ్మకూడదు. అనవసరంగా ఒకరి నోటి నుండి, మరొకరికి చెప్పుకొని ఈ రీతిగా Propagate చేస్తున్నారు. మనకు ఇష్టములేని ఇటువంటి విషయాలు విననే కూడదు. వినటముగాని, మరొకరి దగ్గర మాట్లాడుకొనుటగాని, అది కేవలము వారి Weakness యొక్క ప్రభావము కాగలదు.

## శత్రువులెవ్వరు? మిత్రులెవ్వరు?

ప్రపంచమునకు ఏ తొందరలులేవు. ఏ బాధలు రావు-రాబోవు. ఏదో ఇంత విశాలమైన ప్రపంచములో మధ్య మధ్య ఇటువంటివి జరుగుతూనే ఉంటాయి. ఇరాక్ ఇరాన్ గొడవలు, 10 సంవత్సరముల నుండి జరుగుతూనే ఉన్నవి. ఇది పెద్ద యుద్ధముగా మనము విశ్వసించకూడదు. మన భారతదేశములో పంజాబులో కూడా ఈ రీతిగానే జరుగుతూనే ఉన్నది. ఇది ఒక పెద్ద యుద్ధమా? కేవలము వ్యక్తిగతమైన దోషములు, ఈ రకమైన మార్గాన్ని సాధిస్తూ వస్తున్నాయి. భారతదేశమునుగాని, మరేదేశమునుకాని మన సద్భావాలే రక్షించి కాపాడే బాంబులు. మనకు సద్భావములు కలిగి ఉంటే సర్వమూ రక్షింపబడుతుంది. నిజంగా శత్రువులెవ్వరు అట్లే మిత్రులెవ్వరు? మన పాపములే మనకు శత్రువులు, మన పుణ్యములే మనకు మిత్రులు. ఈ పాప పుణ్యములు ఎల్లప్పుడు మన వెంట నీడవలె వెంటాడుతునే ఉంటాయి. కాబట్టి శత్రువులు మనకు ఏ దేశమునందూ లేరు. మన భావములే మనకు శత్రువులు. మన భావములను పరిశుద్ధము గావించుకొని సరియైన జీవితాన్ని, ఆదర్శవంతమైన జీవితాన్ని అందించాలి.

## సాయిసంకల్పం — వజ్రసంకల్పం

విద్యార్థులు చాలా బాగా పాడినారు. అనంతపురం కాంపస్, బృందావనం కాంపస్, ప్రశాంతి నిలయం కాంపస్, చాలా బాగా భజనలో పాల్గొని, అన్ని విధాలా భక్తి శ్రద్ధలు చూపించినారు. సాయి అనుగ్రహమనే బ్యాంకులో ఎంత విలువైనవి ఉన్నవో, ఎంత విలువైనవి మీకు అందించడానికి సంకల్పించుకొన్నాడో, కాబట్టి సాయి సంకల్పానికే మీరు వదలిపెట్టండి. ఎంతో పవిత్రమైన, విలువైన అనుగ్రహ వజ్రాన్ని అందించటానికి సిద్ధముగా ఉండినప్పుడు అల్పమైన, స్వల్పమైన కోరికలు మీరు కోరనక్కర లేదు. సాయి అనుగ్రహమునకు మీరు వదలిపెడితే, అన్ని అనుగ్రహములు ఆతనిలో లీనమైపోయి, ఆతడన్నివిధాల మీకు సుఖశాంతులను అందిస్తాడు.

—శ్రీవారి దివ్యబోధ
పూర్ణచంద్ర ఆడిటోరియం,
ప్రశాంతినిలయం, 13-2-1991.
(శివరాత్రి మరునాడు ఉదయం)



## చందాదారులకు విజ్ఞప్తి

(ఏ) వార్షిక చందా 20 రూపాయలు మనియార్డరు ద్వారా— కన్వీనరు, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్సు ట్రస్టు, ప్రశాంతినిలయం (పోస్టు), అనంతపురం జిల్లా, ఏ. పి. — 515 134కు పంపవలెను.

(బి) వేరుగా ఎక్నాలెడ్జిమెంటు కోరువారు తమ చిరునామాగల రిప్లైకార్డు పంపవలెను.

(సి) చందాలు ఒక సంవత్సరమునకు మాత్రమే స్వీకరింపబడగలవు.

(డి) చందాదారు పూర్తిపేరు, చిరునామా మనియార్డరు కూపను (సమాచార్ అనుచోట) పైననే స్పష్టముగా పెద్ద అక్షరాలతో వ్రాసి పంపవలెను.

(ఇ) మనియార్డరు కూపనుపైన, పత్రిక ( ఇంగ్లీషు / తెలుగు) ఏ భాషలో కావలెనో స్పష్టముగా పేర్కొనవలెను.

(ఎఫ్) చందాల రెన్యూవల్ కోరునప్పుడు, ప్రస్తుత చందాసంఖ్యను పేర్కొంటూ, రెండునెలలు ముందుగా పంపవలెను.

(జి) క్రొత్తగాచందాలు కట్టినవారికి చందా స్వీకరించిన రెండుమాసాల తర్వాత నుండి పత్రిక పంపగలం.

# మేధావులు కాదు - ధీమంతులు కావాలి

"తల్లి గర్భము నుండి జన్మించినప్పుడు, మానవుని కంఠములో- మంచిముత్యాలహారాలు, మేల్మిబంగారపు దండలు, రత్నాలహారాలు, గోమేధికపుమాలలు, మణి - మాణిక్యములతో పొదిగిన హారాలు, పచ్చలదండలు, మున్నగునటువంటి— 'హారాలు' మచ్చునకైనా అవి ఏవీ కానరావు. కాని, మానవుని కంఠములో ఉన్నది ఒక్కటే మాల. అదే! బరువుమాల. జన్మజన్మల నుండి పొందుపరచి, తన వెంట పంపిన కంఠమాల. 'మంచి - చెడ్డల' రెండింటినీ త్రుంచకుండా, కర్మలన్నింటినీ గ్రుచ్చిన కంఠమాల."

ప్రేమస్వరూపులారా!

జన్మకు కర్మయే కారణము. ప్రతి మానవుడు కారణజన్ముడే. కర్మ ద్వారా జన్మించిన ఈ జన్మకు ధర్మము ప్రధాన పురుషార్థము. ఈనాడు లోకములో ధర్మమనగా లౌకికంగా, పారమార్థికంగా వ్యవహరింప జేసేది. జాతి, మత, కుల, వర్ణ, లింగ, ఆశ్రమము- మున్నగునవి ఆధారముగ పురస్కరింపజేసుకొని, ధర్మములను మనం అనుభవిస్తున్నాము. ధర్మమునకది సరియైన అర్థము కాదు. దేశ, కాల, పరిభావములకు లొంగక సర్వత్ర, సర్వమానవులకు, సమస్త దేశములకు సమిష్టియైన స్వరూపమే ధర్మము. మానవుడు ధరించినదే ధర్మము. మానవుని ధరించినట్టిది మానవత్వమే. కాబట్టి మానవునకు మానవత్వమే ధర్మము.

## త్రిపుటి - త్రికరణ శుద్ధి

మనస్సు, మాట, క్రియ- ఈ మూడింటి ఏకత్వమే మానవత్వము. ఈ 'త్రిపుటి' చేత ఆచరించే సర్వ కర్మలు ధర్మములే. ఈ త్రికరణశుద్ధితో చింతించేదంతయూ శాంతియే ఈ త్రికరణశుద్ధితో నడిచే నడతలన్నియూ అహింసలే. ఈ త్రికరణశుద్ధితో పలికే పలుకులన్నియూ సత్యములే. కనుక, ఈ యావత్ మానవులకు సదా సంబంధించిన ధర్మం, ఒక కాలమునకు ఒక దేశమునకు, ఒక వర్ణమునకు లేక లింగమునకు సంబంధించినది కాదు. దేశ, కాలములకు అతీతమైనది కనుకనే, ధర్మమునకు సనాతనమైనదనే పేరు.

ఈ లౌకికమైన జగత్తునందు నూతనమైన ధర్మములు అనేకములు వెలువడుతూ ఉంటాయి. దేశ, కాలములతో పట్టుబడనటువంటివి. ఈ దేశ, కాలములకు సంబంధించిన సర్వధర్మములు కాలానుగుణ్యముగా కదలిపోతూ, మారిపోతూ ఉంటాయి. ఈ సనాతన ధర్మమే మారిన మానవత్వమే ఉండదు. అగ్నికి దహనశక్తి, ప్రకాశము అది దాని సహజత్వము. ఈ సహజమైన ప్రకాశత్వము, దహనత్వము ఈ అగ్ని కోల్పోయిన, ఇది బొగ్గుగా మారిపోతుంది. బెల్లమునకు తీపి సహజధర్మము. ఈ బెల్లమునందు తీపితనమనే సహజధర్మం కోల్పోయిన, అది మట్టిముద్దగా రూపొందుతుంది. అదే విధముగనే, మానవునియందు సహజమైన త్రిపుటి, త్రికరణశుద్ధి అనేవి ఉండినంతవరకే అతడు మానవుడు. ఈ త్రికరణశుద్ధి అనే దివ్యత్వమును కోల్పోయిననాడు, కేవలము ఆకారమానవుడే.

## ' భ్రాంతి '

మానవ జీవితము అమూల్యమైన మాణిక్యము వంటిది. మాణిక్యమును మసిబొగ్గునకు అమ్ముకొన్నట్లుగా, ఈ దివ్యమైన మానవత్వాన్ని కేవలము, విషయవాసనలకు నిరంతరం అంకితము గావించుకొంటున్నాము. దీనికి కారణము ఏమిటి? మనస్సునందు అనేక విధములైన దోషములు ఉంటున్నవి. ఇందులో శాస్త్ర రీతిగా నాలుగు దోషములు ప్రధానమైనవి. ఒకటి భ్రాంతి, రెండవది ప్రమాదము, మూడవది కరణాపాటవము, నాల్గవది విప్రలిప్స. ఈనాల్గింటి దోషములచేతనే మనస్సు మాలిన్యముపొంది, తద్వారా తన స్వస్వరూపాన్ని మరచి, కేవలం ఈ లౌకిక విషయములందు తాను మునుగుచున్నది. మొట్టమొదటిది భ్రాంతి. ఇది భ్రమ. జగత్తంతయూ భ్రమతోనే కూడి ఉంటున్నది. వస్తువునకు రూపం ఒకటిగా ఉండినా, దీనిని అనేక రూపములుగా ఇది గోచరిస్తూ ఉంటుంది. ఇదే భ్రమ. ఉన్నది ఒక్కటైతే, తలంచుట మరొకటిగా ఉంటుంది. సత్యమును - అసత్యముగను, అసత్యమును - సత్యముగాను భ్రమిస్తూ ఉంటుంది. త్రాడు పామునగానూ, పాము త్రాడుగనూ భ్రమిస్తుంది. మానవత్వము సత్యమనే భ్రాంతి చేతనే, ఆ సత్యమైన దివ్యత్వాన్ని కొంతవరకు మానవుడు మరచిపోవుచున్నాడు. దేహము అనిత్యము. అనిత్యము నందే, నిత్యము ఉంటున్నది. నిత్యానిత్యముల యొక్క స్వరూపమే మానవత్వము. అనిత్యము దేహము — నిత్యము దేహి. కాని మనము దేహిని మరచి, దేహమునే విశ్వసిస్తూ ఉన్నాము. అసత్యమును సత్యముగనూ, నిత్యమును అనిత్యముగనూ విశ్వసిస్తున్నాము. ఈ భ్రాంతి చేతనే ఏనాడో ఒకనాడు మన దేహమును కోల్పోతున్నాము.

## ప్రమాదం

రెండవది ప్రమాదము. భ్రమచేతనే ప్రమాదము మనకు సంభవిస్తున్నది. ఈ భ్రమ ప్రమాద సమ్మిశితమైన స్వరూపము. ఈ శరీరము సత్యమని భ్రమించి మనం ప్రమాదమునకు గురియైపోతున్నాము. ఈ విధమైన భ్రమతో రెండవ దోషమైన ప్రమాదము సంభవిస్తోంది. త్రాడనుకొని పామును పట్టుకొంటే, ప్రమాదముకాక మరేమవుతుంది?

## కరణాపాటవము

మూడవది కరణాపాటవము. కరణము అనగా ఇంద్రియము. అది ఒక పనిముట్టు. అపాటవము అనగా దౌర్బల్యము. ఈ ఇంద్రియములకు ఒక విధమైన దౌర్బల్యము ఉంటున్నది. మనస్సు స్వయంగా పదార్థములను చూడలేదు. కేవలం ఇంద్రియములను ఆధారము చేసుకొనియే పదార్థములను చూడగలుగుచున్నది. మనస్సు స్వయముగా వినలేదు. చెవులను ఆధారము చేసుకొనియే విశ్వములోని శబ్దమును వింటున్నది. ఈ విధంగా మనస్సు ఇంద్రియములను ఆధారము చేసుకొనియే సర్వకర్మలనూ ఆచరిస్తున్నది. అయితే ఈ ఇంద్రియాలు అనేక లోపములతో కూడినవి. అనేక దౌర్బల్యములతో చేరినవి. అనిత్యమైనవి.

రోగములతోచేరినవి. ఇట్టి అనిత్యము, అశాశ్వతము, అసత్యమైన, రోగపీడితమైన ఇంద్రియములను ఆధారము చేసుకొని మనస్సు అనుభవించుట చేతనే, ఈ ఇంద్రియముల దోషము మనస్సు నందు ప్రతిబింబిస్తున్నది. ఇంద్రియముల దోషము చేతనే, మనస్సు మాలిన్యము చెందుచున్నది.

## సహవాస దోషం

మనస్సు చాలా పరిశుద్ధమైనది, పవిత్రమైనది. కాని సహవాసముచేత అది మాలిన్యం పొందుచున్నది. మనస్సు, ఇంద్రియములు చేరుటవలన మానవుడు మంచి - చెడ్డలను అనుభవిస్తున్నాడు. మట్టి గాలితో సహవాసము చేసినప్పుడు, గగనము వరకూ ఎగురుతుంది. నీటిలో సహవాసము చేసినప్పుడు గుంటలో దిగుతుంది. క్రిందికి దిగుటకు మట్టికి కాళ్ళులేవు, ఆకాశానికి ఎగురుటకు మట్టికి రెక్కలులేవు. ఇది సహవాస దోషము వలననే ఆకాశములో ఎగురుచున్నది. అట్లే గుంతవరకూ దిగుచున్నది. కనుక మానవుడు సహవాస దోషముల చేతనే మనస్సును మాలిన్యము గావించుకొని, తద్వారాదుఃఖములకు, విచారములకు గురౌతున్నాడు. మన సహవాసము ఎట్టిదో, మనమూ అట్టి వారుగా రూపొందుతాము. కాబట్టి మానవునకు సత్సంగము చాలా ప్రధానము, అత్యవసరము. నీవు ఎట్టి వారి సహవాసము చేతువో, అట్టి స్వభావమునే నీవు పొందుతావు.

## విప్రలిప్స

నాలుగు విప్రలిప్స. విప్రలిప్స అనగా అసూయ అని దీనికి అర్థము. ఈ అసూయ మహా చెడ్డగుణము. దీనినే ఓర్వలేనితనము అనికూడా అంటారు. ఉన్న వారిని చూచి ఓర్వలేరు. కలిమి కలిగినవానిని చూస్తే, కొలిమి లేకనే మనస్సు కమిలిపోతుంది. నిరంతరము పరులదోషాలనే వెదకుతుంది. పరులకీడునే ఆశిస్తుంది. మంచిని ఏనాటికీ, చింతించలేదు. ఇది అసూయ. ఈ అసూయ ఎట్టి చింతలు తాను కలిగి ఉంటుందో, అట్టి రూపాన్ని ధరిస్తుంది. ఈ అసూయ మానవుని రాక్షసునిగా మారుస్తుంది. ఈ అసూయ మానవునికి మహాపాపకరమైన దోషం. ఈ దోషములన్నీ మనస్సుపైన ప్రవేశిస్తున్నవి. మనస్సు మంచిదైనప్పటికిని, ఈ విధమైన సంపర్కము చేత మనస్సు మాలిన్యము పొందుతున్నది. మల, విక్షేప, ఆవరణములను దూరం గావించుకోమని వేదాంతం బోధిస్తుంది; ఈ మలినము మలమువంటిదే. మలమును ఎవ్వరూ ప్రీతిగా ఆశించరు. ఎవ్వరూ చెంతచేర్చరు. మాలిన్యము పొందిన మనస్సు ఎవ్వరినీ చేరదు. నది పుట్టేసమయంలో అతి పరిశుద్ధమైన జలముగా పుడుతుంది. కానీ అనుభవించే మనుష్యుల స్థాయికి వచ్చేటప్పటికి, మాలిన్యము చెందుతుంది. అదే విధముగానే మనో ప్రవాహమనేది పరిశుద్ధముగనే ప్రవహిస్తుంది. దీనిని అనుభవించే మానవుని చెంతచేరేటప్పటికి మాలిన్యం చెందుచున్నది.

ఈ అసూయద్వారా ప్రపంచములో మానవుడు అనేక దుఃఖములకు గురి అగుచున్నాడు. పరులపైన అసూయకలిగి, వారి చెడ్డను నీవు ఎంతగా కోరెదవో, అంతకంటే అనేక రెట్లు, అంతగా ఆ చెడ్డ నీకే ఎదురు తిరుగుతుంది. మహాభారతము నందు ఈ అసూయ ప్రభావము, మనకందరికీ, చక్కగా తెలిసిన విషయమే. పాండవులను చూచి కౌరవులెంత అసూయ పడిరో, కట్టకడపటికి, ఆ అసూయ వారినే ధ్వంసము చేసింది. అంతేకాదు. వారి సర్వనాశనము గావించినది. ఈ అసూయచేత క్రోధము పెరుగుతుంది. ఈ క్రోధము కలిగినవానికి, మానవత్వము ఏమాత్రమూ అర్థము కాదు.

## మనోనిర్మలత — ఏకాత్మభావన

మనము మాలిన్యమైన మనస్సుతో చేసిన సాధనలు, ఏరీతిగా ఉంటాయి? బురదను, బురదతో కడిగినట్లుగా ఉంటాయి. మనస్సుకు ఉండిన దోషములచేత ఎన్ని సాధనలు చేసినప్పటికీ, ఇది ఏమాత్రము పరి

శుద్ధము కాదు. మొట్టమొదట మనస్సుకు చేరిన మాలిన్యము నిర్మూలనము గావించుకోవాలి. మనస్సుకు చేరిన మాలిన్యము, ఏరీతిగా నిర్మూలనమవుతుంది? సంఘసేవ యందే. ఏకాత్మ భావమునందే, ఈ మాలిన్యం నిర్మూలనమవుతుంది. మనము ఏకాత్మ భావమును పొందాలి. ఈ ఏకాత్మభావన సేవయందు మాత్రమే మనకు లభ్యమవుతుంది.

## అంతఃకరణ

మనస్సునకు మరొకపేరు అంతఃకరణ. దీనినే బుద్ధి, చిత్తము, అహంకారము, అంటారు. కరణము అనగా పనిముట్టు. అంతఃకరణ అనగా లోపలి ఇంద్రియములు. అంతఃకరణ యందు ఇది నిత్యానిత్య విషయ పరిశీలన గావించటానికి ప్రయత్నిస్తుంది. ఈ నిత్యానిత్య విషయ పరిశీలనచేసే స్వభావము కలిగి యుండుట చేతనే, దీనికి బుద్ధి అని పేరు వచ్చింది. ఇది మహా సూక్ష్మమైనది. దేహము కంటే ఇంద్రియములు, ఇంద్రియముల కంటే మనస్సు, మనస్సు కంటే బుద్ధి, ఒకదానికంటే ఒకటి సూక్ష్మమైన స్వరూపాలు. ఈ బుద్ధి కంటే సూక్ష్మమైనది ఆత్మ. ఈ బుద్ధి ఆత్మకు సమీపముగా ఉండుటచేత ఇది ప్రభావితమైనది. బుద్ధి గలవాడే శ్రద్ధబూని ఉన్నత స్థానము పొందగలడు. బుద్ధి ఒక అద్దమువంటిది. అద్దము ఎంత పరిశుద్ధమైనప్పటికినీ, దాని వెనుక భాగములోపల ఒక రసాయనము పాదరసముపూత ఉంటుంది. అద్దము ఎంత పరిశుద్ధమైనప్పటికీ పాదరసము పూయకుండిన మన ప్రతిబింబము కనిపించదు. అదే రీతిగనే బుద్ధి చాలా పవిత్రమైనది. చాలా విలువైనది. చాలా బలమైనది. అయినప్పటికీ, దీనికి మరొకపైపున ప్రేమ రసాన్ని పూసినప్పుడే ఇందులో నీ స్వరూపాన్ని స్పష్టంగా నీవు చూడగలవు. ప్రేమచేతనే నీ స్వస్వరూపాన్ని నీవు దర్శించగలవు. స్వస్వరూపమును గుర్తించడమే సరియైన మానవత్వము.

ఈనాటి మానవుడు తనను తాను మరచిపోయి ప్రపంచాన్ని తెలుసుకొనుటకై ప్రయత్నిస్తున్నాడు. మానవునికి, అన్నీ తెలుసుకానీ— "తానెవరో?" తనకు తెలియదు. ''తనను తాను'' తెలుసుకొనక, ఎన్ని తెలుసుకొన్నప్పటికీ ఏమి ప్రయోజనం? కాబట్టి, తనను తాను తెలుసుకొనుటకు ప్రయత్నించాలి. తనను తాను తెలుసుకొనుటకు ప్రేమయే ఆధారం. ప్రేమయే ప్రధానము. ప్రేమయే ప్రమాణము.

## బుద్ధి ఒక ఖగము

బుద్ధిని— ఉపనిషత్తులు ఒక పక్షిగా పోల్చుకొన్నాయి. పక్షి అనగా ఖగము. ఈ పక్షికి రెండు రెక్కలు, ఒక తోక ఉంటాయి. పక్షి తలకు శ్రద్ధ అని పేరు. కుడివైపు రెక్కకే ఋతము, ఎడమవైపు రెక్కకే సత్యము అన్నారు. తోకయే యోగము అని అన్నారు. బుద్ధి అనగా శ్రద్ధ, ఋతము, సత్యము, యోగములతో కూడినది. మొదటిది శ్రద్ధ. శ్రద్ధ అనగా ఆసక్తి. ఈ శ్రద్ధ లేకుండిన మానవుడు ఏ చిన్న కార్యమూ చేసుకోలేడు. శ్రద్ధ కలవాడు ఎట్టి ఘన కార్యమైనా సాధించగలడు. వేదాంతము నందు— "శ్రద్ధావాన్ లభతే జ్ఞానం" అని చెప్పబడినది. ప్రతీ మానవునకు శ్రద్ధ ఉన్నచోట ఎంత కష్టమైన దానినైనా సాధించటానికి పూనుకుంటాడు. శ్రద్ధయే లేకుండిన ఏచిన్న కార్యమైనాచేసి విజయాన్ని సాధించలేడు. శ్రద్ధతో కూడినది బుద్ధి. రెండవది ఋతము. ఋతము అనగా త్రికరణములతో కూడినది. మనస్సు, వాక్కు, క్రియ, మూడింటి ఏకస్వరూపమే ఋతము. ఈ త్రికరణ శుద్ధితో కూడినదే బుద్ధి. మూడవది సత్యము. సత్యము అనగా ప్రాకృతమైనది. చూచినది చూచినట్లు, విన్నది విన్నట్లూ, చేసినది చేసినట్లుగాను వాక్కు ద్వారా ఉచ్చరించటమే సత్యము.

సత్యమునకు, ఋతమునకు ఉండిన వ్యత్యాసము:— సత్యము అప్పటికప్పుడు జరిగిన విషయ

మును మాత్రమే వివరంగా బోధిస్తుంది. కాని ఋతం త్రికాలములందు మారని సత్యాన్ని గుర్తిస్తుంది. నీవు ఒక వ్యక్తిని చూచినప్పుడు, తాను 'బుష్కోటు' వేసు కోవచ్చు, 'ప్యాంటు' ధరింపవచ్చు. అప్పటికది సత్యమే. రేపటి దినమునకు అతను "పైజమా"నో, "కుర్తా"నో వేసుకోవచ్చు. రేపటికి మొదటి దినము ధరించినది మార్పు చెందుటచే, అది అసత్యముగా మారుతుంది. అప్పటికప్పుడే గుర్తించగలిగేది సత్యం. త్రికాలములందు మారనటువంటిది ఋతము. కనుక శ్రద్ధ, ఋతము, సత్యములతో కూడినటువంటిది బుద్ధి.

నాల్గవది యోగము. యోగము అంటే తోక. యోగమనగా ఎమిటి? కూడిక లేక చేరిక, ఒకదానితో ఒకటి చేర్చేటటువంటి సమత్వంతో కూడినటువంటిది. చిత్తవృత్తులకు లోబడనది. "యోగః చిత్తవృత్తి నిరోధః" అని పతంజలి అన్నాడు. చిత్తవృత్తిని అరికట్టేది యోగం. ఆ చిత్తవృత్తిని అరికట్టినప్పుడే, తాను ఏ ప్రదేశమునకైనా, ఏ సమయమందైనా ప్రయాణము చేయగలడు. గాలిలో ఎగురగలడు.

ఈనాడు పక్షులను మనము చూస్తున్నాము. రెండు రెక్కలు ఒక తోక ఉండుటచేతనే ఆకాశంలో సంచరిస్తున్నాయి. రెక్కలు ఉండి, తోక లేకపోతే, ఆకాశములో - సంచరించలేవు. తోక ఉండి రెక్కలు లేకపోతే అది ఆకాశంలో ఎగురగలదు. కనుకనే బుద్ధి సర్వవ్యాపకత్వము పొందటానికి ఋతము, సత్యము, యోగము వీటి ఆధారము చేతనే, బుద్ధి పవిత్రమైన సూక్ష్మ స్వరూపాన్ని పొందుచున్నది. కనుకనే— "బుద్ధిఽగ్రాహ్యమతీంద్రియం" అన్నారు.

## ఆస్థా - స్వాస్థా

ఈనాటి మానవుడు బుద్ధి గొప్పదా? మేధస్సు గొప్పదా? అని విచారణ చేసుకొంటే, అనేకమంది పండితులు మొదలుకొని, పామరుల వరకూ మేధస్సే గొప్పదని నిర్ణయము చేస్తారు. వేదాంతమందు కాని, ఉపనిషత్తులయందు కాని, ఈ సమాధానము అంగీక రింపబడదు. బుద్ధి కంటే మేధాశక్తి చాలా చిన్నదని భావిస్తుంది. మేధాశక్తి ఏమాత్రం పనికిరాదని నిర్ణయం చేసుకుంది. ఒకానొక సమయమందు విక్రమాదిత్యుడు బుద్ధి గొప్పదా? మేధాశక్తి గొప్పదా? అని సమా వేశం జరిపించాడు. అనేకమంది పండితులందరూ మేధాశక్తి గొప్పదని భావిస్తూ వచ్చారు. కాని విక్రమాదిత్యుడు "ఆస్థా - స్వాస్థా" అన్నాడు. ఆస్థా అనగా కేవలము ఒక విధమైన ఆసక్తియే, స్వాస్థా అనగా స్థిరత్వము అని అర్థము. ఇక్కడ ఆసక్తి, స్థిరత్వములేని మేధాశక్తి ఏమి ప్రయోజనం ఉంటుంది? అని నిర్ణయించాడు.

## మేధావులు - బుద్ధిమంతులు

ఈనాటి మేధావుల యందు స్థిరత్వము ఎక్కడా కనిపించడములేదు. సామాన్యమైన మానవుని యందు ఒక విధమైన స్థిరత్వము ఉంటుంది. కానీ, మేధావుల యందు స్థిరత్వమే ఉండదు. గొప్ప మేధావులమని అనుకొంటారు కానీ, వారికి అన్ని సందేహములే. మేధాశక్తి ప్రభావములు ఈ రీతిగా ఉన్నవి. దేనిని విశ్వసించరు. విశ్వాసములేని మేధాశక్తి ఏమి ప్రయో జనం? స్థిరత్వముతో, ఆసక్తితో, ఋతముతో, యోగముతో, శ్రద్ధతో కూడినటువంటిదే బుద్ధి. ఇన్ని పవిత్రమైన గుణములు కలిగిన బుద్ధిని, మేధాశక్తితో ఏమాత్రమైన పోల్చుటకు వీలగునా? కనుక, ఈనాటి మానవులందరూ మేధావుల కంటే, బుద్ధిమంతులు కావటం అత్యవసరము.

బుద్ధిమంతునకు వినయవిధేయతలుంటాయి, విశ్వాసము, స్థిరత్వము ఉంటాయి. మేధావుల యందు వినయవిధేయతలు ఏమాత్రము కనిపించవు. మేధా వులకు అహంకారము పెరిగిపోతుంది. బుద్ధి కంటే అహంకారము మరింత సూక్ష్మమైనది. అహంకారము బుద్ధిని భ్రష్టు పట్టిస్తుంది. అహంకారమునకు చోటివ్వక బుద్ధిని అనుసరించి, దివ్యత్వాన్ని అర్థము చేసుకొను

టకు, మనము ప్రయత్నించాలి. ఆనాటి మహా మేధావులు, బుద్ధికే ప్రాధాన్యతను ఇస్తూ వచ్చారు.

### 'జ-గత్'

ఈ లోకములో బ్రతుకు నిమిత్తమై ఎన్ని విధములైన భేదములనో, పుట్టించుకొంటూ వస్తున్నారు. దీని పేరే ప్రకృతి. ఈశ్వరుని శక్తిస్వరూపమే ప్రకృతి. ఈ ప్రకృతికి "జగత్తు" అని మరొకపేరు. జగత్తు అనగా ఏమిటి? "జ- గత్", వచ్చి పోయేది. ఇందులో శాశ్వతమైనది ఏ ఒక్కటీలేదు. ఈ జగత్తునందు అన్నీ శాశ్వతములే, మరి అన్నీ అశాశ్వతములే— ఈ నిత్యానిత్యములతో, సత్యాసత్యములతో కూడినది ఈ జగత్తు. త్రికరణశుద్ధితో కూడినప్పుడు అన్నీ సత్యములే. త్రికరణములు వేరు వేరైనప్పుడు ఇవన్నీ అసత్యమే.

### ఎట్టి కర్మలు ఆచరించాలి ?

మానవుడు తాను మానవుడుగా బ్రతకాలనుకుంటే, త్రికరణశుద్ధిని పెంచుకోవాలి. త్రికరణశుద్ధి కలిగినవాడే మానవుడు. అది లేకపోతే మానవుడే కాదు. ఏనాడు మనము త్రికరణశుద్ధితో మానవుడుగా జీవించెదమో, ఆనాడే మాధవత్వమనేది, మనకు చక్కగా అర్థమౌతుంది. ఈ త్రికరణశుద్ధి కలగాలంటే "చిత్తస్య శుద్ధయే కర్మః". కర్మలు ఆచరించాలి. ఎట్టి కర్మలు ఆచరించాలి? అంటే పవిత్రమైన కర్మలు, పరోపకార సంబంధమైన కర్మలు, సమాజపరమైన కర్మలు, సహజమైన ప్రేమ కర్మలు, పరులకు ఆనందమును అందించే కర్మలు ఆచరించాలి. "ఒకరిని నొప్పించక, తానొవ్వక, తప్పించుకొని తిరిగి, ఇతరులకు సరియైన సేవలు సల్పుతూ, దైవత్వాన్ని మానవుడు పొందాలి". భగవన్నామముచేత సేవలు చేయుచూ, పరోపకార దీక్షనుపొంది, దివ్యత్వాన్ని మనము గుర్తించి, ఆత్మతత్త్వంలో ఆనందమును అనుభవించాలని ఆశిస్తూ- దీస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

—శ్రీవారి దివ్యబోధ
హిల్‌వ్యూస్టేడియం శాంతివేదిక,
ప్రశాంతినిలయం,
21—11—1990



మానము, మౌనము మానవునికి కీర్తిప్రతిష్ఠలు తెచ్చును. మానవుడు పావనుడేకావి, పామరుడు కాడు. మానవుడు నిర్మించినది యంత్రము, మానవుని నిర్మించునది మంత్రము. యంత్రము బహిర్ముఖము. మంత్రము అంతర్ముఖము. మానవత్వంలోని సోదరత్వమును, దైవత్వములోని పితృత్వమును తెలుసుకోండి. మృణ్మయరూపులను చిన్మయరూపులుగా మార్చుటకు సాధన అవసరం. ముంతకు మూకుడుకు తమ స్వరూపము 'మన్ను' అనే ఎఱుక ఉండాలి. మోక్షము మోహక్షయము. మానవుణ్ణి పదార్థ బంధితుడు కాకుండా, ప్రజ్ఞాన బంధితునిగా చేయుటకు "భగవంతుడు అవతరించును".

-బాబా

# సంకల్పజనిత శరీరధారి - శ్రీ సత్యసాయి



శ్లో॥ " యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య త దాత్మానం సృజామ్యహమ్ " అను
గీతా శ్లోకముననుసరించి " లోకమునందు ధర్మమునకు హాని సంభవించినప్పుడు, అనగా
ధర్మాచరణ మందగించి, అధర్మము ప్రబలినప్పుడు భగవంతుడు " తనకు తానే " ఒక
రూపమును ఎన్నుకొని మానవాకారమున భువినందు ఉద్భవించుననని అర్థము ".

భగవంతుడు రూపరహితుడు, గుణాతీతుడు, సర్వవ్యాపి, సర్వజ్ఞుడు, ఏ నామమునకు చెందనివాడు, అన్ని నామములు తానైనవాడని శృతులు, ఉపనిషత్తులు, వేదములు, ఇతిహాసములు ఎలుగెత్తి ఘోషించుచున్నవి. అటువంటి నిరాకారుడు నరాకారం ధరించిన సమయమునందే మన చర్మచక్షువులు భగవంతుని చూడగలిగే అదృష్టము పొందగలవు. అంతేకానీ, ఇతరత్రా భగవత్స్వరూపమును గాని, లీలలు గాని, గుణములు కాని ఏ మానవుడు వీక్షించి, ఆశ్రయించి, ఆరాధించి, అనుగ్రహమును పొందుటకు అవకాశములేదు. ఏమన భగవత్ స్వరూపము సత్యం, జ్ఞానం, అనంతమగుటచే. కనుకనే— " సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ " అనే ఉపనిషత్ వాక్యము భగవంతుని ఉనికిని ప్రకటించుచున్నది. " నిరాకారుడు నరాకారమును ధరించి భువినందుద్భవించుటే అవతారము ", అనగా దిగివచ్చుటయని భగవాన్ బాబావారు నుడివిరి. ' దివి ' అనగా ఊర్ధ్వలోకమగు స్వర్గమున కావలి నుండి, అధోలోకమగు భూమిపై జన్మించుటకే అవతారమని అర్థము.

## అవతారరహస్యం

అయితే మనము కూడా పరమాత్మ నుండి విడివడిన జీవాత్మలమేగదా! పరమాత్మ స్థానమగు దివి నుండి, మానవనివాసస్థలమగు భూమిపై పుట్టుటలేదా? మనలది అవతారమే కదా ? అనే సంశయమునకు కూడా బాబా జవాబిచ్చిరి. మీరు అవతారములే. కాని మనకు, బాబాజన్మల యందుగల అవతారరహస్యమును ఈ విధంగా సభాముఖంగా ఒకపరి ప్రకటించిరి- " నాది సంకల్పజన్యశరీరము, స్వార్థరహితమైనది. లోకోద్ధరణ నిమిత్తము అవిర్భవించబడినది. కాని మీది కర్మజన్య శరీరములు, స్వార్థపూరితమైనవి, కర్మానుభవ నిమిత్తము జన్మించబడినవి. అష్టసిద్ధులు, అష్టైశ్వర్యములు, తన వామ హస్తము నందు, పంచభూతములు, సృష్టి, స్థితి, లయములు తన కుడిచేతి యందు సదా తన ఆజ్ఞలు పాలించుటకు సర్వసిద్ధముగా నుండుననియు, త్రికాలజ్ఞానమే తన అపూర్వ శక్తియనియు తెలుపుతూ, సమయము వచ్చినప్పుడు ఈ భువిని దివిగాను, దివిని భువిగాను సంకల్పమాత్రమున

చేయగలనని" తెలవిచ్చిరి. అట్టి శక్తి మానవాతీత మైనది. కేవలము భగవత్పరమైనదని తెలియనగును.

నేటివరకు గతించిన కాలప్రవాహమున కృత యుగము, త్రేతాయుగము, ద్వాపరయుగములు గడ చినవనియు, వర్తమానము కలియుగమనియు, ఇందు ధర్మదేవత పూర్తిగా అధర్మముచేత అణగద్రొక్కబడు టచే, తాను ఆమెకు బంధవిముక్తిచేసి, ధర్మము నాలుగు పాదములు శోభిల్లునట్లు చేయుటకే ఈ ఉపాధిని పొందినట్లు విశదీకరిస్తూ ఈ విధముగా తన దైవత్వ మును పలుమార్లు సభాముఖముగా యావత్ మానవాళి ఎదుట ప్రకటించిరి.

## ఆ వైకుంఠవాసి - శ్రీ సత్యసాయి

ఏ గుణములు కల్గుటవలన నిరుపేద కుచేలుని, బాలధ్రువకుమారుని, భక్తప్రహ్లాదుని బ్రోచుటకు ఆ వైకుంఠవాసి, ఆ పరమపురుషుడు, ఆ చక్రధారి భువిని అవతరించవలసి వచ్చినదో, ఆ గుణములు గల ఆర్త జనావళిని రక్షించు నిమిత్తం, ధరయందు సత్య, ధర్మ, శాంతి, ప్రేమలను పునరుద్ధరణ గావించే నిమిత్తమే, ఈ సత్యసాయి స్వరూపమును ఆ వైకుంఠవాసి మరల ధరించవలసి వచ్చినదని శంఖానాదము గావించిన సంగతి పల్వురు వినియుండవచ్చును. "వైకుంఠ వాసియే, ఈ సత్యసాయి, సచ్చిదానంద మూర్తి, పుట్టపర్తి షట్చక్రవర్తి" అని ఎలుగెత్తి చాటిన మాటలు సాయిసంస్థల సభ్యుల చెవుల యందు మార్మోగని క్షణముండదనుట అతిశయోక్తి కాజాలదు.

స్వామికి జన్మనిచ్చిన తల్లిదండ్రులు 'సత్య నారాయణ' యను నామకరణము చేసినప్పటికి, సాయి సంసార బంధములను తెగత్రెంపులు చేసుకొని, లోకో ద్ధరణ నిమిత్తము ఇల్లును విడిచిన పిదప "శ్రీ సత్య సాయి"గా ప్రకటించబడి యావత్ ప్రపంచము చే గుర్తించబడిరనుట కూడా అతిశయోక్తి గాదేమో? స్వామి ఒకపరి సభాముఖమున, సర్వమానవాళి ఎదుట, "నేను సత్యము, నాపేరే సత్యము, నేనే సత్యస్వ రూపమని" ప్రకటించి తానే భగవంతుడనని ప్రక టించిరి. ఆ సందర్భమునే "శ్రీ సత్యసాయి" అను నామమునకు సంకేతాక్షరము "యస్" త్రయము అనగా యస్, యస్, యస్ (SSS) అనియు, తన పదకోశ మందు అంతా 'యస్'యేగాని 'నో' యన్నది లేద నియు, 'నో' 'యస్'లు అజ్ఞానులు, స్వార్థ బుద్ధిగల అహంకార మానవాళిదని ఈ విధంగా ప్రకటించిరి— "'యస్' అనువానికి 'యస్' అనురా, 'నో' అను వానికి 'నో' యనురా, 'నో' 'యస్'లు నీ నోటికిరా, స్వామికి సర్వం యస్, యస్, యస్" అనగా స్వామిని నిఖిల, నిర్గుణ పరబ్రహ్మముగా గుర్తించి, వర్తించిన వారికి ఆ విధమగు నిత్య, శుద్ధ, బుద్ధ, నిరంజన స్వరూపమగు పరబ్రహ్మంగా దర్శనమిచ్చి చరితార్థుని చేయుదురనియు, సాధారణ మానవునిగా గుర్తించి, వర్తించెడి వారిక్, ఆ మేరకు అనుగ్రహించి రక్షిం చుననియు, ఏ నమ్మకములేక గారడీవాడని, మాయచే లోకమును భ్రమింప జేయుచున్నాడనే వానికి ఆ విధ ముగా అజ్ఞానాంధకారములో ముంచి భ్రష్టుని గావించె దరని తెలియనగును. పవిత్ర గంగాతీరమును చేరి స్నానముచేసి తమ నివాసములకు ఆరాధన నిమిత్తము గంగను తెచ్చెడి సంకల్పించెడి భక్తుల ఎంచుకొనెడి పాత్రలమేరకే గంగాజలం లభించునట్లు సాయి భక్తుల అచంచల దృఢవిశ్వాసము మేరకే సర్వేశ్వరుడగు శ్రీ సత్యసాయి పరమేశ్వరుల అనుగ్రహం లభించుట నిర్వివాదాంశము. పై విషయమును ప్రసంగవశాత్తూ విశదీకరిస్తూ ఒకపరి బాబా "అనుగ్రహప్రసాదము"ను గురించి ఈ విధముగా వివరించిరి— "తిండినిపట్టి త్రేపు, పిండిని పట్టిరొట్టె, సాధననుబట్టి సాక్షాత్కారం, అందుకోండి ఆశీస్సులు" అని తెలుపుచూ— త్రికరణశుద్ధిగా స్వామి యొక్క ఆదేశముల మేరకు వర్తించెడి నిజభక్తులను కంటికి రెప్పవలె సదా రక్షిం చెదనని ఈ విధముగా అభయప్రదానమిచ్చిరి— "శ్రీ పుట్టపర్తి నిలయుడు కాపాడును నిన్ను నెపుడు కరుణామయుడై, చేపట్టి నిన్ను బ్రోచును, ఏ పట్టున

విడువకుండ ఏలును నిన్నున్". "అడవిలోనున్న, ఆకాశముననున్న, పట్టణముననున్న, పల్లెనున్న, గట్టు మీదనున్న, వట్టేట నున్న, మరువడు నిను సాయి మదిలో నెపుడు".

## భవరోగవైద్యుడు — యుగపురుషుడు

త్రేతాయుగమందలి శ్రీరామునివలెను, ద్వాపర మందలి శ్రీకృష్ణునివలెను ఈ కలియుగావతారియగు శ్రీ సత్యసాయి ఎందువలన పై అవతారపురుషులవలె ప్రవర్తనా నియమావళి ననుసరించలేదని మరి కొందరి కించిదజ్ఞుల సంశయమునకు, స్వామి ఈ విధముగా బదులిడిరి— "శ్రీ రామునివలె ఎందుకుండ లేదు? శ్రీ కృష్ణునివలె ఎందుకు చేయలేదని ప్రశ్నించే హక్కు సర్వసామాన్య మానవునికి లేదు. శ్రీ రాముడు శ్రీ రాముడే! శ్రీ కృష్ణుడు శ్రీ కృష్ణుడే! సాయి సాయియే. అవతార కార్యక్రమానుసరళి ఆయా కాలమునకు కట్టుబడి నిర్ధారించబడునేగాక, తొలినుండి చివరివరకు ఏకరీతిగా ఉండదన్న సంగతి మానవుని మేధస్సుకి అందని విషయము. కాలానుగుణ్యముగ ఉద్భవించిన యుగపురుషుని సూచనలను, ఆదేశములను తు. చ. తప్పక పాటించి యావత్‌మానవాళి సుఖ, శాంతులను, భగవదనుగ్రహమును పొందవలెనే గాని, అవతారతత్త్వమును, ప్రవర్తనను అల్ప బుద్ధితో విమర్శించెడి హక్కులేదు. తగు సూచనలిచ్చే అర్హత లేదని నొక్కివక్కాణించిరి. ఏమన వైద్యుడు సమస్తరోగములకు ఒకే ఔషధమును, పథ్యమును నిర్ధారణ చేయడు సరికదా! రోగి యొక్క రోగతీవ్రతను, శరీరతత్త్వమును బట్టి, ఔషధమును, మోతాదును, అనుపానమును, పథ్యమును తెలుపును. ఆ విధముగనే, భవరోగ వైద్యుడను 'యుగపురుషుడు' ఆయా యుగపరిస్థితిని బట్టి మానవాళినుద్ధరించెడి కార్యక్రమ నియమావళిని నిర్ధారించుననిరి.

## యుగపురుషుల లీలలు

మరియు గతించిన యుగావతారులగు శ్రీరామ, శ్రీ కృష్ణులు, నేటి కలియుగావతారివలె సభాముఖంగా, తానే భగవంతుడనని స్వప్రమాణముగా ప్రకటించినట్లు ఏ ఇతిహాసములు, పురాణముల యందు వ్రాయబడలేదు. ఋషులు, జ్ఞానుల వలన తెలియపరచబడలేదన్నది అతిశయోక్తి కానేరదు. ఆయా యుగపురుషులు తమ లీలల ద్వారానే మానవాళి తమని దైవముగా గుర్తించేటట్లు ప్రవర్తించిరి. ప్రస్తుత మానవాళిలో వేరొక కోవకు చెందినవారు గతించిన అవతారములు చేపట్టిన ఆయుధములను గురించి, నేటి యుగావతారి అవలంభించెడి నిరాయుధీకరణ గురించి తర్జన భర్జనలు చేయుట బాబా గ్రహించి ఈ విధముగా అట్టి వారల సందేహనివృత్తి చేసెను.

## తిరుగులేని ఆయుధం శ్రీవారి అభయహస్తం

కృతయుగము, త్రేతాయుగము, ద్వాపరయుగములందు ఆసురీ ప్రవృత్తిగల రాక్షసులు, ఘోరమైన తపస్సుచేసి పరమేశ్వర వరప్రసాద బలగర్వముతో యావత్ మానవాళిని పలువిధముల బాధలకు గురి చేయుటవలన, అట్టి రాక్షసుల సంఖ్య, సాధుజనులతో పోల్చిన బహుతక్కువగ నుండుట వలన, చిటికెనవ్రేలి పైన లెక్కించదగినదిగా ఉండుటవలన కోదండము, సుదర్శన చక్రాయుధముచే వారిని మట్టుబెట్టి ధర్మ సంస్థాపన గావించిరి. కాని ప్రస్తుత కలియుగమందలి మానవాళిలో అత్యధిక శాతము ఆసురీ ప్రవృత్తి కలిగి అన్యాయ, అక్రమ, అధర్మములకు పాల్పడినవారగుట వలన, వారికి కేవలము మానసిక పరివర్తన తన ప్రబోధల ద్వారా, ఆచరణ ద్వారా ముందుగా తాను చేసి చూపించదలచుట వలన ఆయుధము ధరించెడి ఆవశ్యకత, అవసరము కలుగలేదనిరి. మరియు అట్టి అత్యధిక సంఖ్య గల దుష్టజనావళిని ఏదో ఒక ఆయుధముతో మట్టుబెట్టిన ఉద్ధరించేదెవరినని ప్రశ్నించిరి. ఏతావాతా అవతారమునకు ఆయుధమునకు అవినాభావ సంబంధముందని, అది యుగపురుషునికి శోభిల్లునని తలిస్తే, తన వరద అభయహస్తమే, కలియుగావతారి

యగు శ్రీ సత్యసాయీశుని తిరుగులేని ఆయుధము, సర్వులయెడ ప్రేమతో వర్తించుచే శ్రీ సత్యసాయి ఆశయమని విపులీకరించిరి.

## ప్రదర్శనశాల - ధనార్జన

కించిదజ్ఞులగు మానవాళికి ప్రతిక్షణము నందు సంశయములు ఉద్భవించుట సర్వసహజమే మో యన్నట్లు, మరి ఒక కోవకు చెందిన కొంతమంది— ప్రతీ యుగము నందూ, దైవము భువిపైన అవతరించినప్పుడు కేవలము మానవ రూపమునే ఏల ధరించవలెను ? వేరొక వైవిధ్యము గల సర్వులను సంభ్రమ ఆశ్చర్యములలో ముంచే రూపము ఎందులకు ధరించలేదు అనెడి చొప్పదంటు ప్రశ్నలకు స్వామి ఈ విధముగా చమత్కరించిరి— "పశు, పక్షాదులకు విచక్షణా జ్ఞానము లేకపోవుటచే ఆ జీవరాసుల రూప ధారణకు అవకాశములేదు. అట్టి దైవ వరప్రసాదిత మగు విచక్షణాజ్ఞానముగల మానవ రూపమును ధరించి వారిలో కలసి, మెలసి, తిరుగుచూ, నవ్వుతూ, ఆడుతూ, పాడుతూ, మెసలుతూ, చిన్నపిల్లలకు తిను బండారములు, ఆటవస్తువులను ఇచ్చి ఆకర్షింపచేసి, తమ చెప్పుచేతలలో వారి ప్రవర్తనను మార్పుచేయు విధముగా, లీలలతో కొందర్ని, అపూర్వ వస్తునము దాయప్రదానంతో కొందర్నీ, మానసిక, శారీరక, ఆర్థిక బాధల నుండి నివారణచేసి, చాలామందిని మానసిక పరివర్తనచేసి సత్య, ధర్మ, శాంతి, ప్రేమ మార్గాను వర్తులుగా చేయుట జరుగుచున్నది. అట్లుగాక మీరు కోరినట్లు ప్రత్యేక వింత రూపధారణ చేసిన, అతి తెలివిగల మానవాళి, ఆ అవతారపురుషుని కూడా గొలుసులతో బంధించి, ప్రదర్శనశాల యందుంచి ధనార్జన చేసెడివారన్న ఆశ్చర్యమేమున్నదని ఎదురు ప్రశ్నవేసిరి ".

## ఆ నిరాకారుడే ఈ నరాకారుడు

వేరొక తరహాకు చెందిన మానవాళి తమ, తమ మనస్సుల యందు స్వామి స్త్రీయా? పురుషుడా? ఇవి రెండూ కాదా? అని తర్జన భర్జనలు చేయుచుండుట సర్వజ్ఞుడగు శ్రీ సాయి గ్రహించి ఈ విధముగా తెలవిచ్చిరి— " స్త్రీలలో ఉన్నప్పుడు స్త్రీని, పురుష లతో మసలుచున్నప్పుడు పురుషుణ్ణి, ఒక్కడిగా నున్న ప్పుడు 'పరమాత్మ'ను " అని తేటతెల్లంగా శంఖ నాదము గావించినప్పటికీ, శ్రీ సత్యసాయిని దైవంగా నిర్మల చిత్తమునందు ప్రతిష్ఠించుకొనలేని మానవాళిని దురదృష్టవంతులనక తప్పదు. ఏమన ఏ అవతారమందు కనీసము అట్టి అవతారస్వరూపుని దగ్గరగా దర్శించెడి అవకాశమే కలుగలేనప్పుడు, ఇట్టి ప్రశ్నపరంపరలకు తావెక్కడ? ఏ అవతారము ఇంత శాంతముగా, విపులముగా సమాధానమిచ్చినదన్న ఋజువెక్కడ? కనుకనే స్వామి పలుమార్లు తమ ప్రవచనములద్వారా ఆవేదనను ఇట్లు ప్రకటించుట విననివారుండరు. "నిరాకారుడు నరాకారముదాల్చి" పలుమార్లు దర్శన, స్పర్శన, సంభాషణ భాగ్యములందిస్తున్ననూ, స్వామి ఆదేశములను ఆచరించుటకు సంసిద్ధత చూపక పోవటమేగాక, ఆయా ఆదేశములను మనస్సు నందు స్థిరముగా నిలుపుకొని, ఆచరించెడి శక్తిని ప్రసాదించమని కూడా వాపోవలేదన్నదే— నా బాధ యన్న స్వామి బాధను, ఆవేదనను నివారించెడి సాధకుడే లేడా ? యన్న సంశయము కల్గుటకబ్బురము లేదు. అందువలననేమో ? స్వామి పలుమార్లు— "సాయితో ఇంత సన్నిహిత సంబంధము మున్ముందు లభించునన్న గ్యారంటీ లేదు. ఏ యుగమందు, ఏ యుగావతారీ ఇంత సులభంగా తమ భక్తులకు ఇంతటి సన్నిహితసంబంధ అవకాశమును ప్రసాదించలేదు. ఈ మహదవకాశము చేజేతులార దిగజార్చుకొన్న, మరల మానవజన్మ లభించును, మరల అవతారపురుషునితో ఇంత చక్కటి సన్నిహిత సంబంధములుండ గలవన్న గ్యారంటీ లేదన్న" హెచ్చరిక సందలి పరమార్థమును గ్రహించ వలసిన సమయము ఆసన్నమయినది.

## శంఖానాదం

కలియుగమందలి మానవాళి నిక్కముగా ఎంతో అదృష్టవంతులనుట నిర్వివాదాంశము, నిస్సంశయము. ఏమన మన అందరి మధ్యను సాక్షాత్‌పరమాత్మ మన లుతూ, యావత్ ఆధ్యాత్మిక, వేద, శాస్త్ర, పురాణ, ఇతిహాసముల యందలి రహస్యములను తేటతెల్లంగా, అరటిపండు వలచి అందించు చందంబున, పామరుడు సహితము గ్రహించునంతటి సులభ శైలిలో ప్రవచనముల ద్వారా సప్రమాణముగా, సోదాహరణముగా వివరించు పద్ధతి, వెనుకటి అవతారపురుషులు చేసిన దాఖలా లేదు. మున్ముందు జరుగనున్న సంగతి మనకు ఊహాతీతమైనదని గ్రహించవలసి ఉన్నది. కనుకనే సాయి "సకల వేదాంత గ్రంథాల సారమెల్ల, ఒక్క మాటలో చెప్పెద, ఒక్క సారి" అన్న శంఖానాదము విననివారుండరు. "సత్యమే నా ప్రచారము, ధర్మమే నా ఆచారము, శాంతియే నా స్వభావము, ప్రేమయే నా స్వరూపము"— ఈ నాలుగింటి యందు ఏ ఒక్క దానిని మీరు అనుసరించి సిద్ధించుకొన్ననూ— "మీరు నాలో లీనమగుట తథ్యమనిరి. ఏ ఒక్కదానిని సాధించిననూ, మిగిలినవి ఒకదానికి వేరొకటి రైలుపెట్టెల వలె ముడిపడినవి అనిరి".

## పాపమంటే పరదేశంలో లేదు

"ఒక్క అడుగు నా వైపు వేస్తే— పది అడుగులు నీ వైపువచ్చి అనుగ్రహిస్తానని" స్వామి ఎన్ని పర్యాయములు యావత్ మానవాళిని ఉద్దేశించి ప్రకటించలేదు? దానికి మానవాళి సమర్పించిన కార్యరూపమెట్టిది? మీరు ఏమీ ఆచరించకపోయినప్పటికీ పరవాలేదు. కానీ పరులకు అపకారము తలపెట్టకండి. చేతనైన ఉపకారం చేయదలచిన చేయండి. లేనట్లైన, మిన్నకుండుటయే ఉత్తమము అని ఉపనిషత్ వాక్యమందలి— "పరోపకార పుణ్యాయ, పాపాయ పరపీడనం" గురించి విపులీకరిస్తూ— "పాపమనగ వేరు పరదేశమునలేదు, తాను చేయు పనుల తగిలియుండు" అని వివరిస్తూ, పుణ్యము చేయలేకపోయిననూ చింతించనక్కరలేదు. కానీ, ద్రోహ బుద్ధి, అపకారంచేసెడి తలంపు లేకపోతే ఉపకారం, పుణ్యం చేసినంతటి ఫలితమిచ్చునని చమత్కరించిరి.

## ఏకైక మార్గం

మనసా, వాచా, కర్మణా త్రికరణశుద్ధితో— "సాయీ!" అంటే, "ఓయీ" అని బదులిచ్చెదనన్న హామీ ఏయుగమందైన ఏ అవతారపురుషుడు ఇచ్చినట్లు ఏ పురాణ, ఇతిహాస, ఉపనిషత్తులు— తెల్పియున్నవో చెప్పగలరా? సంసార బంధనములవలన ఐతేనేమి, మానసిక పరిపక్వత కలుగకపోవుటవలన ఐతేనేమి, స్వామివారి ఆదేశములను, తు. చ. తప్పక పాటించలేకపోయితిమని ఆంతరంగికముగా బాధపడుతూ, కనీసము నిత్యకృత్య నిర్వహణ యందైనా, తమ తమ ఇష్టమైన దైవనామమును, మేల్కొనిన క్షణం నుండి, నిద్రించు వరకూ ఆంతరంగికముగా స్మరించుటే ఈ కలియుగమునందు మానవునికి "ముక్తి" లభించుటకు ఏకైక మార్గమని తెలియనగును. కనుకనే— కలియుగములో నామస్మరణ యనునది జన్మసార్థకతకు నిర్దేశించబడినది.

## స్మరించదగిన మంత్రం

నిజమైన సాయిభక్తులకు "ఓం శ్రీ సాయిరాం" అనునదే జపించదగిన మంత్రము, స్మరించదగిన నామము, తరించదగిన మార్గము. "కరుణామయుడు, దయాసముద్రుడు, సర్వజ్ఞుడు, సర్వాంతర్యామియైన 'సాయియే'— ఎవరికి తగిన తరణోపాయమును వారికి సూచించి తరింపచేయునన్న గాఢవిశ్వాసమే, సాయి పాదపద్మములకు సమర్పించెడి పూజాపుష్పము, కర్పూర నీరాజనము, ఆత్మనివేదనము".

—పి. యస్. వి. సుబ్రహ్మణ్యం,
శ్రీకాకుళం.

# శ్రీ సత్యసాయి మాతృస్తవం

ఉ॥ కమ్మని యంద చందముల కల్మిని బల్మిని చెల్మినిచ్చి లో
కమ్ములజేయ, పెంపగ, వికల్పమొనర్చెడి భద్రయోగమున్
నెమ్మదినిచ్చి యాజ్ఞనిడి నిర్విషయస్థితి వెల్గు సాయి మా
యమ్మ దయాబ్ధినిచ్చుత యనంత సదాత్మక దివ్యసంపదల్॥

ఉ॥ కమ్మని లేతనవ్వుల మొగమ్మును గాంచగ ధీర భావనా
స్యమ్మును జూడ, ఈ జగతినంతయు లీలగనేలు ప్రాభవ
త్వమ్మున దివ్యమూర్తివయి భాసిలు స్త్రీజగదంబ - సాయి మా
యమ్మ దయాబ్ధినిచ్చుత నహం మమకార విదూర సంపదల్ ॥

ఉ॥ ముమ్మరమైన బాధలవి మూర్కొనినప్పుడు నీదు పాద ప
ద్మమ్ముల నమ్ము భక్తులకు త్వత్కరకంజ విభూతి నీయ సే
మమ్ము లభించు దివ్య మహిమాలయ మూర్తిగనిల్చు సాయి! ఓ
యమ్మరొ! నా హృదంతరము నందు వసించిన యంత ముక్తి మా
ర్గమ్మది నాదు హస్తమున రాజిలు యామలకంబుగానగున్॥

—సాయం నారాయణ చరణం

## శ్రీ సత్యసాయి గురుకులం, రాజమండ్రి — 533 101
## 1991—92 విద్యా సం॥ములో ప్రవేశములు

మా వసతి పాఠశాలలో తమ బాలురను చేర్పించగోరు తల్లిదండ్రులు— కరస్పాండెంటు, శ్రీ సత్య సాయి గురుకులం, రాజమండ్రి - 533 101 చిరునామాకు 21-3-1991 తేదీలోగా రూ॥ 15/—లు మానియార్డరు ద్వారాగాని, డిమాండుడ్రాఫ్టు ద్వారాగాని పంపి దరఖాస్తు ఫారం, ప్రాస్పెక్టస్ పొందవచ్చును

ఈ క్రింద చూపబడినట్లుగా బాలురకు మాత్రమే ప్రవేశము కలదు.

ఇంగ్లీషు మీడియమ్ : 1వ తరగతికి 36 మంది, 2వ తరగతి నుండి 8వ తరగతి వరకు తరగతికి 5 మంది బాలురకు ప్రవేశము కలదు.

తెలుగు మీడియమ్ 1వ తరగతికి 36 మంది, 2వ తరగతికి 30 మంది, 3వ తరగతికి 15 మంది, 4వ తరగతి నుండి 6వ తరగతి వరకు తరగతికి 5 మంది, 7వ తరగతికి 6 మంది, 8వ తరగతికి 15 మంది బాలురకు ప్రవేశము కలదు.

కరస్పాండెంటు.

# శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ (డీమ్డ్ యూనివర్సిటీ)

విద్యాగిరి, ప్రశాంతినిలయం - 515134, అనంతపురం జిల్లా (ఆం. ప్ర.)

## ప్రవేశ ప్రకటన

1991 జూన్ మొదటి వారంలో ప్రారంభం కానున్న విద్యా సంవత్సరము 1991-92కి ప్రశాంతినిలయం కాంపస్ (పురుషులకు), బృందావనం - వైట్‌ఫీల్డ్ కాంపస్ (పురుషులకు) మరియు అనంతపురం కాంపస్ (స్త్రీలకు) లలో ఆర్ట్స్, సైన్సు, కామర్స్ విషయాలలో అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులున్నాయి.

పంచవర్షీయ ఇంటిగ్రేటెడ్ (మాస్టర్స్) కోర్సుకు గానీ, త్రివర్షీయడిగ్రీ కోర్సుకు గానీ ప్రవేశాలుకోరే అభ్యర్థులు కనీసం 50 శాతం సగటు మార్కులతో 12 ఏళ్ళ ఉన్నత పాఠశాల విద్యాభ్యాసాన్ని గుర్తింపబడిన బోర్డు ద్వారా విద్యార్హతను సంపాదించి ఉండాలి.

అడ్మిషన్ టెస్టుకు మునుపు + 2 పరీక్షలో కూర్చొని ఉండవలెను.

ఆర్ట్స్, సైన్సెస్, కామర్స్, బిజినెస్ అడ్మినిస్ట్రేషన్ (ఎం. బి. ఏ) విషయాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు ప్రశాంతినిలయం కాంపస్‌లో (పురుషులకు), ఆర్ట్సు, (ఫిలాసఫీ, ఇంగ్లీషు, తెలుగు), హోం సైన్సు, ఎడ్యుకేషన్ (బి. ఇడి.) విషయాలలో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు అనంతపురం కాంపస్‌లో (స్త్రీలకు) కూడా ఉన్నాయి.

ఎం. బి. ఏ, బి. ఇడి., తదితర పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులలో ప్రవేశాలుకోరే అభ్యర్థులు 15 సం॥ల నియత విద్య అనగా 10+2+3 సంవత్సరాల విద్యాపద్ధతి లేదా దానితో సరిసమానమైన ఇన్‌స్టిట్యూట్‌చే గుర్తింపబడిన విద్యార్హతను పూర్తిచేసి ఉండాలి. ఫైనల్ పరీక్షలో ప్రత్యేక విషయం (సబ్జక్టు) లోను, జనరల్ ఇంగ్లీషులోను కనీసం 50 శాతం మార్కులు సంపాదించి ఉండాలి.

అయితే పోస్టు గ్రాడ్యుయేట్ డిగ్రీ పరీక్షలో 60 శాతం లేదా అంతకన్నా ఎక్కువ మార్కులు సంపాదించినచో, ఈ నియమాన్ని ఇన్‌స్టిట్యూట్ విచక్షణతో సడలింపు చేయవచ్చును. అడ్మిషన్ టెస్ట్‌కు మునుపు గ్రాడ్యుయేట్ / క్వాలిఫైయింగ్ పరీక్ష వ్రాసియుండాలి. అడ్మిషన్ టెస్ట్‌కు అప్లైచేసే అభ్యర్థులు తమ డిగ్రీ ఫైనల్ పరీక్షా ఫలితాలకుగాని, మార్కుల స్టేట్‌మెంటు కోసంగాని కాచుకోనక్కరలేదు. కానీ, ఫైనల్ పరీక్షకు మునుపు ఉన్న పరీక్షా ఫలితాల ఆధారముపై అప్లైచేయవచ్చును.

అప్లికేషన్ ఫారం, ఇన్ఫర్‌మేషన్ హ్యాండు బుక్ కోసం ఆసక్తిగల విద్యార్థులు 11వ తారీఖు ఫిబ్రవరి నుండి - ఏప్రియల్ 6వ తారీఖు వరకు పోస్టు ద్వారా తెప్పించుకోవచ్చును. లేదా ఏప్రియల్ 11వ తారీఖు వరకు నేరుగా తీసుకోవచ్చును. పైన తెలుపబడిన వివిధ కోర్సులకు ప్రవేశ పరీక్షలు 1991 మే నెల మొదటి పక్షంలో జరుగును. ప్రతీ కోర్సునకు అప్లికేషన్స్ వేరువేరు విధములుగా, ప్రత్యేకంగా ఉండుటచేత, అభ్యర్థులు తమ వినతిపత్రములలో వారి పేరు మరియు వారు ప్రవేశము కోరుచున్న కోర్సు (సబ్జక్టు) విషయం వివరముగా వ్రాయవలసినది. వినతి పత్రములతోబాటు పి. జి., ఎం. బి. ఎ., బి. ఇడి. కోర్సులకై 45/— రూపాయలు, అండర్ గ్రాడ్యుయేట్ కోర్సులకై 35/— రూపాయలు ఐ. పి. ఓ. (లేక) బ్యాంకు డ్రాఫ్ట్ ద్వారా— శ్రీ సత్యసాయి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ హైయర్ లెర్నింగ్ పేర ప్రశాంతినిలయం — 515 134, అనంతపురం జిల్లా, (ఆంధ్రప్రదేశ్) అడ్రస్సునకు పంపవలెను.

రిజిస్ట్రార్.

## *Statement about Ownership and other Particulars about Newspaper*

SANATHANA SARATHI (Telugu Edition, No. R. N./10772/64)

**(to be published in the first issue every year after the last day of February)**

**FORM IV (See Rule 8)**

| | |
|---|---|
| 1. Place of Publication | Prasanthi Nilayam<br>Dist. Anantapur (A. P.)<br>Pin. 515 134 |
| 2. Periodicity of its Publication | Monthly |
| 3. Printer's Name<br>Nationality<br>Address | Pramod Kumar Suri<br>Indian<br>P. O.: Prasanthi Nilayam<br>Dist. Anantapur (A. P.)<br>Pin. 515 134 |
| 4. Publisher's Name<br>Nationality<br>Address | Pramod Kumar Suri<br>Indian<br>P. O.: Prasanthi Nilayam<br>Dist. Anantapur (A. P.)<br>Pin. 515 134 |
| 5. Editor's Name<br>Nationality<br>Address | V. K. Narasimhan<br>Indian<br>P. O.: Prasanthi Nilayam<br>Dist. Anantapur (A. P.)<br>Pin. 515 134 |
| 6. Name and addresses of individuals : who own the newspaper and shareholders holding more than one percent of the total Capital | Sri Sathya Sai Books and Publications Trust,<br>P. O.: Prasanthi Nilayam<br>Dist. Anantapur (A. P.)<br>Pin. 515 134 |

I, Pramod Kumar Suri, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

PRAMOD KUMAR SURI
*Signature of Publisher*

*Date : 1-3-1991*